# THE
# PADUKA PATTABHISHEKAM.

A TELUGU DRAMA IN FIVE ACTS.

BY

**D. KRISHNAMACHARLU**

"ANDHRA NATAKA PITHAMAHA"

**FOURTH EDITION**

PUBLISHED BY

D. K. Krishnama Charlu & Bros.,

PRINTED AT THE

Rama Vilasa Press,

BELLARY.

1926





[PRICE Re. 1-4-0]

శ్రీ

# పాదుకాపట్టాభిషేకము.

"ఆంధ్ర నాటక పితామహ" యను బిరుదువహించిన

## ధర్మవరం-రామకృష్ణమాచార్యులచేత

రచియింపఁబడి

డి. కె. కృష్ణమాచార్యు, వారి సహోదరుల వలనఁ

ప్రకటింపఁబడియె.

[illegible]

బళ్ళారి

రమావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1926



క్రయము రూ. 1—4—0



## ఈ నాటకమున వచ్చుపాత్రలు తత్ప్రవేశస్థలము.

1. దశరథుడు—(అయోధ్యరాజు) (పూర్వ రం. 1, 2, 3,) అం. I రం. 1, 2. అం. II రం. 3. అం. III రం. 2.
2. రాముడు—(దశరథపుత్రుడు) అం. I రం. 1, 2 అం. II రం. 1, 2, 3 అం. V రం. 1, 2.
3. లక్ష్మణుడు—అం. II రం. 2, 3 అం. V రం. 1, 2.
4. భరతుడు—అం. IV రం. 1, 2, 3, 4 అం. V రం. 1, 2.
5. శత్రుఘ్నుడు—అం. IV రం. 1, 2, 4 అం. V రం. 1, 2.
6. సుమంత్రుడు—(దశరథుని మంత్రి) పూర్వరం. I అం. 1 రం. 1, 2 అం. II రం. 3.
7. వసిష్ఠుడు—(రాజగురువు) అం. I రం. 1 అం. II రం. 3 అం. III రం 2 అం. IV రం. 4 అం. V రం. 2.

## స్త్రీలు.

8. కౌసల్య—(దశరథుని పట్టపుభార్య-రాముని తల్లి) అం. II రం. 1, 3 అం. III రం. 2 అం. IV రం. 4 అం. V రం. 2.
9. కైకేయి—(దశరథునిభార్య-భరతునితల్లి) అం. I రం. 2 అం. II రం. 3 అం. III రం. 2 అం. IV రం. 2, 4 అం. V రం. 2.
10. సుమిత్ర—(దశరథునిభార్య లక్ష్మణశత్రుఘ్నులతల్లి) అం. II రం. 3 అం. III రం. 2 అం. V రం. 2
11. సీత—(రామునిభార్య) అం. II రం. 2, 3 అం. V రం. 1, 2
12. మంథర—(కైకదాసి) అం. I రం. 2 అం. II రం. 3 అం. అం. III రం. 1 అం. IV రం. 2.

(పౌరులు. సేవకులు. మొదలగువారు.)

# పాదుకాపట్టాభిషేకము.

## కథాసంగ్రహము.

### ప్రథమాంకము.

రం. 1. దశరథుండు తనదుస్స్వప్నముగుఱించి రాముని సమ్మతింపజేసి పట్టాభిషేకము చేయ నెంచుట.

రం. 2. కైకేయి చెలికత్తెయగు మంథరయొక్క దురాలోచన తనమగఁడు తన్ను చులుకన చేసినాఁడని దృష్టాంతయుక్తముగ కైకకు మంథర బోధించుట. దశరథుని కైక వరమడుగుట. దశరథుని దుఃఖము రాముఁడూరార్చుట.

### ద్వితీయాంకము.

రం. 1. పట్టాభిషేకము నిలుచుటయు తాను అరణ్యమునకు పోవలసివచ్చుటయు రాముఁడు తనతల్లి కౌసల్యకు చెప్పఁగా ఆయమ దుఃఖము.

రం. 2. రాముఁడు సీతనూరార్చి యామెను యరణ్యమునకు వచ్చుట కనుజ్ఞయిచ్చుట.

రం. 3. మంథర గుణాలోచనయొక్క సంపూర్ణదశ. రామాదులు దశరథుని సేవించుట. లక్ష్మణుని మహాగ్రహము నుడికిరాదు రామునివెంట పోవ నేర్పాటు. కౌసల్య యాశీర్వాదము. వియోగము. పౌరులు వెంబడించుట. వారిని రాముఁడు సమాధానపఱచుట. (మహాకరుణారసభూయిష్ఠ రంగము.)

### తృతీయాంకము.

రం. 1. కైకేయియొక్క నాలంబిత్యము. మంథరయొక్క కుయుక్తి సమాధానము.

రం. 2. దశరథుని ప్రలాపమున్ను. అతనినిర్యాణము.

### చతుర్థాంకము.

రం. 1. భరత శత్రుఘ్నులు అయోధ్యకు వచ్చుట. దారిలోని దుశ్శకునములు.

రం. 2. భరతుఁడు తనతల్లివలన రామునియొక్క వృత్తాంతమును, తండ్రి నిర్యాణమును నెఱుంగుట.

రం. 3. భరతుని స్వగత ప్రలాపము (కరుణారసభూయిష్ఠ రంగము).

రం. 4. కౌసల్యయొద్దకు భరతుఁడు వచ్చుట. కౌసల్యయు నాలోచితవాదము. భరతుని సంతాపవాక్యసమితి. (నాటకమునందంతటియు ముఖ్యమైన శోకము గలిగిన రంగము).

### పంచమాంకము

రం. 1. వనమున సీతారాముల మోహానందకర సంభాషణము. భరతాగమనము. లక్ష్మణుని యనుమానభ్రాంతము. రామ భరత సమాగమము.

రం. 2. రాముని మాఱుచి రాజ్యమిచ్చుటకై భరతుని నిష్ఫల ప్రయత్నము. రామ పాదుకా పట్టాభిషేకము.

—()మంగళం()—

శ్రీ

# ఉపోద్ఘాతము

[బి. కె. గురురాజరావు గారు బి.యె, బి.యల్., బళ్ళారి.]

ఈ నాటకమాంధ్రదేశము నందంతయు విఖ్యాతిఁగని, యాంధ్రనాటకపితామహుఁ డను బిరుదముఁబొంది, యనేక నాటకరాజముల రచించి యాంధ్రమాతా సేవను మనసారఁ జేసిన ధర్మవరము రామకృష్ణమాచార్యులవారిచే రచింపఁబడినది. ఈకవితల్లజుఁ డాంధ్రనాటకముల రచించుటలో నవీన ఫక్కిని ద్రొక్కి యాంధ్రనాటకకళకు వింత వన్నె వెట్టెననుట సర్వజనసమ్మతము. ఈకవిచే రచింపఁబడిన పెక్కునాటకములు, సుప్రసిద్ధ మగు సరసవినోదినీ సభవారిచే నాంధ్రదేశమందేగాక యితర ప్రదేశములందుఁ గూడఁ బ్రదర్శింపఁబడి విద్వత్తుల హృదయముల నాకర్షించి వారి మన్నన వడసెననుట యెల్లరకుఁ దెలిసిన విషయమే.

ఈ నాటకమునందలి యితివృత్తము వాల్మీకిరామాయణమునుండి గైకొనఁబడియున్నను, నాటకరంగమున కెక్కించుటకుఁ దగిన రీతిని, నందందు కథాసంవిధానమున సందర్భోచితముగఁ గొన్ని మార్పులు గావింపఁబడియున్నవి. కవులు నిరంకుశులను రీతిని కథాసంవిధానమునకు వన్నెవెట్టుటకునై సకారణములైన మార్పులుకొన్ని గావించి యున్నాఁడనుట యిందలి ప్రస్తావనవలననే తెలియవచ్చుచున్నది.

పాత్రసంపోషణ యీకవికి వెన్నతోఁ బెట్టినది. ఇతని పూర్వకవులును సమకాలికులును మఱియుఁ దరువాతివారును నగు నాటకకర్తలనేక నాటకముల రచించియున్నను పాత్రపోషణలో నితఁ డగ్రగణ్యుఁ డనుటలో నతిశయోక్తి యుండఁజాలదని నానమ్మకము. ఈకవి నాటకరచనలో గీర్వాణకవులు దృశ్యప్రబంధరచనావిషయమున నేర్పరచిన నిబంధనలఁ గట్టుదిట్టముల గమనింపక పోయినను, జగత్ప్రసిద్ధుఁడగు "షేక్స్పియర్" అను నాంగ్ల నాటక కర్తను గొన్నియంశముల

ననుకరించి యున్నాఁడు. గీర్వాణనాటకరచనా సాంప్రదాయమునకు విరుద్ధముగ నీకవి, సారంగధరనాటకమును విషాదాంతముగ నొనరించి యుండుట షేక్స్పియర్ మహాకవియొక్క యనుకరణమును స్పష్టముగ సూచించుచున్నది. షేక్స్పియర్ మహాకవి రచించిన విషాదాంత నాటకములలోని దుష్ట (Villainous) పాత్రలీకవినాటకములలోను గలవు. సారంగధరలోని చిత్రాంగిపాత్రయు నీనాటకములోని మంధరయు నట్టిపాత్రలే కాని షేక్స్పియర్ మహాకవి పోషించియుండుదుష్టపాత్రలకును, నీకవిపోషించియుండు నట్టిపాత్రలకును నొకముఖ్యతారతమ్యము మనము చూడఁగలము. ఆకవిచేఁ బోషింపఁబడిన దుష్టపాత్రలు సకల సద్గుణముల కిరవై యాదర్శప్రాయమైన యొకవ్యక్తిని దమదుర్బోధనకు లోఁజేసికొని పలువిధములుగ దురాశఁగొలిపి తమకుపృథమున కావ్యక్తిని దప్పక నీడ్చుటను మనము తఱచుగఁ జూచున్నాము. ఈకవిచే రచింపఁబడిన నాటకములలో నట్లుగాక, యెన్నిదుర్బోధనలకుఁ జిక్కినను నెన్నికపటోపాయములపాలైనను వానికి లోనుగాక సహజ సౌశీల్య ప్రభావముచే వాని నన్నింటి నణఁగఁద్రొక్కి తమసత్పథమును దప్పని మహాపురుషులు కానవచ్చుచున్నారు. మచ్చునకుగానుగొన్నింటి నుదాహరింపవలెనన్న "అయాగో" యనుదురాత్ముని దుష్టోపాయములకులోనై "ఒథెల్లో" యనుసత్పురుషుఁడు తనకత్యంత ప్రీతిపాత్రమై సుగుణమూర్తి యగుతనప్రేయసిని దనచేతులార నిష్కారణముగఁ జంపినాఁడు ఈకవిచే రచింపఁబడిన సారంగధరనాటకములోని సారంగధరుఁడు చిత్రాంగియొక్క దౌరాత్మ్యమునకుఁ జిక్కి యామె తనకపటకృత్యములచే సారంగధరుని ప్రాణములకెక్కువెట్టినను, దనధర్మపథము నుండి దప్పక ప్రవర్తించుటను జూచుచున్నాము. ఈనాటకములో మంధర తనకపటోపాయములచే భరతుని దనవలలో వేసికొనుటకుఁ బ్రయత్నించినను సద్గుణాఢ్యుని యగుభరతుఁడు మంధర ప్రయత్నముల నతి తుచ్ఛముగఁ జూచుచున్నాఁడు.

## మంధర.

ఈ నాటకములో మంధరపాత్రయు నొక ప్రధాన పాత్రముగఁ గవి పోషించియున్నాఁడు. ఆమె మూలముననే కథాసంవిధాన రచన చాలవఱకు రసవంతముగ నొనర్పఁబడియున్నది. మంధర సహజముగ దుశ్శీల. పరులసంతోషమును జూచి యోర్వఁజాలని దుష్టహృదయ. అకారణ వైరమును సాధించి పరుల నికమలపాలు చేయుటయే యామె మతము. "అహా! పురమంతయు నలంకరింపఁబడుచున్నది. ఎవ్వరు చూచిన నగు నగుమొగము లలరార స్వర్గమేఁ గలిగినట్లు సంతోషభరితులై యున్నారు. రామునికిఁ బట్టాభిషేకమైన నీజనులకేమి? తమకే యభిషేకమగున ట్లుత్సాహముఁ జెంది యున్నారు. ఈ సుఖము నేఁ జూచి యోర్వఁగలనా"

మంధర మిగుల చతుర. నానావిధములఁ దన్ను కైకేయి విశ్వసించునట్లామెకు దుర్బోధగావించి లోఁ జేసికొనుచున్నది. "నాకేమైన దని నీయిచ్చవొప్పునఁ జెడిపోనిత్తునుగాని మీతండ్రి నిన్నత్తగారింటికిఁ బంపునపుడు నిన్ను నాకిల్లడ పెట్టినాఁడే నేనెట్లూరకుందును. నాకన్నుల నీవు చెడిపోవుట చూడఁజాల" అని తాను కైకకు మిక్కిలి యాప్తురాలని చెప్పుకొనుచున్నది.

మంధర మిగులతగులుమారి యనిజను లనుకొనుట తానెఱుఁగును. తానెవ్వరికేమపకారము సేయకున్నను బురజనులందఱు దన్ను దిరస్కరించెద రనియుఁ దానుపోయిన, మాటలాడుచున్నవా రందఱు మాటలుడిగి తాను వెడలివచ్చు నంతవఱకు నందఱు మౌనముద్ర వహింతురనియుఁ దానెఱుఁగును. అందుచేఁ దన్నుఁదిరస్కరించు నయోధ్యాపురివారి కొకగుణ్ణమైనఁ జేయక పోవచ్చునా యనియుఁ దన ప్రభావ మాపురివారికిఁ జూపవలెననియు సమయము నిరీక్షించుచుండి రామునికి సరాజ్యపట్టాభిషేకముఁ జేయించుమూలమునఁ బురివారి కశ్రుజలాభిషేకముఁ గావింపవలెనని కృతనిశ్చయురాలై తాను దలపోసిన దుష్కార్యమును సఫలీకృతముగఁ జేయుట కమాయకురాలగు కైకను సాధనముగ నుపయోగించు కొనుచున్నది.

మంథర మిగుల సాహసవతి. సహజముగఁ గైకకు రాముని పై మిక్కిలి ప్రేమ కలదని తెలిసి, యామెను దనమార్గమున కీడ్చికొనుటకుఁ దగిన సాహస మొనరించుచున్నది.

కైక—"నేను కౌసల్యదాసినైన నగుదునుగాని యట్టిదుశ్చరితమునకు నేనియ్యకొందునా?"

"అయ్యెదరాజ్యబహిష్కృత నయ్యెదఁ గౌసల్యదాసినైననకట నానెయ్యంపు సుతుఁ గానల కడ్యోపనుపంగ నెట్లు లోనుగుదు నబలా" యని మిక్కిలి రితపించినకైక మంథరదుర్బోధన యనువిషము తలకెక్కినతరువాత "మంథరా! ఇట్టి సమయమున ననుఁ జేవిడువ వచ్చునా? నమస్కరించి వేడికొందును. పోకుము" అని దీనముగఁ బ్రార్థించుచున్నది. దీనివలననే మంథరయొక్క బుద్ధికుశలత స్పష్టముగుచున్నది.

మంథరకుఁ గైకయెడ మిక్కిలిచనవు. ఆమె పుట్టినింటి నుండి తండ్రి తనకుశుశ్రూషకై పంపియున్న పరిచారికయో లేక పోఁడుకత్తెయో యగుటం జేసి రాజు భార్యయేయనుకొనుకొంచెమైనను లేక మిక్కిలి చనవుతో మెలఁగుచున్నది.

కైక—"ఆసంతాపమున నానాథుఁడు జీవింపఁగలఁడాయని సంశయము పుట్టుచున్నది"

మంథర—పీడ వీడినది.

కైక—"దుర్జాతివిధవా! ఇంత చేసి యిట్లాడెదవా"?

మంథర—"నీవు కానున్నానంటివి. నన్నేలవిధవాయనెదవు" అనిప్రత్యుత్తర మొసంగినది.

మంథరకుఁదనమేరతనకుఁ దెలియదు. దానికి భరతునిపై మోహము పుట్టుచున్నది. కామమునకు కన్నులు లేవను లోకోక్తిననుసరించి కాఁబోలు భరతుఁడు తనయభీష్టమునకు సమ్మతమిచ్చిన నీవచ్చునని పొంగవడుచున్నది. ఎప్పట్ట నెంత పాముఁదుటయు నెవ్వరెఱుంగుదురని భ్రమపడుచున్నది. తుదకు దానుభరతునకు వ్రాసిన జాబే తనమరణమునకు హేతువుగఁ బరిణమించెను.

## కైక.

ఈమె సద్వంశ సంభూత యగుటచే నైజముగ సుస్వభావము గల వనిత. మిక్కిలి యమాయకురాలు. రాముఁడు సవతికొడుకను భేదబుద్ధియే నాఁడును నెంచి యెఱుఁగని యుదార మానసముగల యువతి. మంథర యను పిశాచమామెను బట్టి పీడించువఱకు నామె భరతునకుఁ బట్టాభిషేకముగావింపవలెనని తలపెట్టియుండలేదు. అటు తరువాత నైనను, రామునిపైని మాతృప్రేమను వీడఁజాలక "మంథరా! యిట్లు మాటలాడకుము. ఆ రామునిపై నీవు పగసాధించెదవా? ఆ రాముఁ డెవ్వరనుకొన్నావు? నాకూర్మిసుతుఁడు. వానికిఁ బట్టాభిషేకమైన నాకుఁ బరమభాగ్యముగదా? మంథరా! నీవేమన్నను నాకాకౌసల్యాసుతునిపైఁ గూర్మిమానను. అయ్యో! రామునా నిట్లనవలయు" అని మంథరకుఁ దనమనోభావమును వెలిఁబుచ్చుచున్నది. రాముని గుణాతిశయములామె మనోవీథిఁ జక్కఁగ నంటియుండెను. భరతునికంటె రాముఁడు తనయెడ నెక్కుడు భక్తిగలవాఁడని యెఱిఁగి యామె మంథర దుర్బోధనకుఁ జిక్కువఱకు రామునం దత్యంతమాతృవాత్సల్యమును నెఱపి తనకుమారుఁ డగుభరతునివలె భావించియుండెను. మంథర యామెను జెడుత్రోవ ద్రిప్పుట కెంతయో ప్రయాసపడుచున్నది.

మంథర—నీపతికి నీపై మోహము గలదని యెంచియున్నావా చెప్పుము.

కైక—నాకేమియు సందేహము దోఁపదు.

మంథర—కైపు తలకెక్కినప్పుడేల తోఁచును.

కైక—అదియేమే యతనికి రాముఁడు వేఱా భరతుఁడు వేఱా? అని యామె మంథరయొక్క ప్రశ్నలకన్నిటికిని సమాధానములు చెప్పుచు రామునియం దనురాగమును దనమనోవృత్తియొక్క నిర్మాలిన్యమును దనయమాయకత్వమును బ్రకటించుచున్నది.

మంథరయొక్క దుర్బోధనకుఁ జిక్కినతరువాతగూడ నామెసుస్వభావము మాఱినది కాదు. రాముఁడరణ్యమునకు బోవుటకు మునుపే యామెకుఁ బశ్చాత్తాపము కలుగుచు "మంథరా! ఎంత కార్యమాయెనే

ఏమి యుత్పాతముకలిగెనే! నాపతి సంతాపము చెప్పఁజాల. ఇంతేకు నని యెఱుఁగ” నని తాను చేసిన మహాపరాధముయొక్క ఫలమును స్మరణకుఁ దెచ్చుకొని దిగులు పడుచున్నది. కాని మంధర పన్నిన కపటోపాయముల వాగురలఁ జిక్కి వెలుపలికి రాఁ జాలకమరల “మంధరా! నీమాట నిక్కము ఇప్పుడు వెనుదీసిన నపకీర్తియొక్కటియే నిలుచు. నీవలె హితము చెప్పువారు నాకు లేరు. నీయుపకారమున కేమొనర్తును. కొమ్మా యీచంద్రహారము.” అనిమరల వెనుదీయు చున్నది. ఆమెనైజముఁగ సౌహార్ద్రి.

“భరతునికిఁబట్టముఁగట్ట వరమడుగుము కాని రామునరణ్యాము నకుఁబంపు వరమడుగకు”మని కౌసల్యాసుమిత్రలు చేతులంటి బతిమాలి నపుడామె హృదయము కరఁగినదై యేమియుఁ బ్రత్యుత్తరముఁ జెప్పలేక మంధరను జూచుచున్నది. మంధర వలదని సైగచేయుఁగా మరల కాఠిన్యమును వహించుచున్నది.

తుదకుఁ దాను గావించిన మహాపరాధముయొక్క ఫలము దనకు వైధవ్యము దెచ్చెనని విలపించుటయుఁ గౌసల్యాసుమిత్రాదు లకుఁ బట్టరాని దుఃఖము గలిగించి వారియెడఁ దాను మహాపరాధము గావించి నందులకై వారిక్షమాపణ వేఁడుటయు నామెయొక్క సహజ సుస్వభావమును మంధరయొక్క దౌరాత్మ్యమును బ్రబలముగఁ జాటు చున్నవి. తుదకుఁ దనదుశ్చరితమునకుఁ గారణము తానే యిట్లుచెప్పు కొనుచున్నది— “ఆమంధర పాపాలి విధివ్రాలెఁ బీడించెను. ఎంత బుద్ధి తిరిగినను మానక యుపదేశించెను. ఒక్క పాపము వేయొక్క పాప ములకుఁ దెఱవుఁ జూపెను. ఒక్కసారి పాపమొనర్చిన కఠినహృదయము దాని మెత్తఁబఱచు సందర్భములు గలిగినట్లెంతయు మఱింత కఠిన మగుచువచ్చె. ఇట్లయి యీగతికి వచ్చితి.”

## భరతుఁడు.

ఇతఁడు కేవల నిష్కలుషుఁడు. రామునియం దపారభక్తిగల తమ్ముఁడు. పితృభక్తిపరాయణుఁడు. కేవల ధర్మాసక్తుఁడు. సీతయం దితఁడు భక్తియు ననురాగమును గలవాఁడు. ఆమెపరమసాధ్వీలలామ

యనియు నామెకుఁదనయెడ నపారమగు పుత్రప్రేమ గలదనియు నాతని దృఢవిశ్వాసము. అందఱి దుఃఖములకుఁ దనజన్మమే కారణమని నిందించుకొనుచున్నాఁడు. కైకకేల జనియించితినని తిట్టుకొనుచున్నాఁడు. "తలయెత్తరాని నిందలమోచి దుష్కీర్తి నవనిపై నీకఁదగు గాఁడఁగలనే" యని విలపించుచున్నాఁడు. ఎవ్వరు తన్నుదప్పుదలఁచినను కౌసల్యాదేవి తప్పుదలఁచి యుండదను నమ్మకము వమ్మైనపుడాతని సంతాపమునకు మేరయే లేదు. మిన్నువిఱిగి పైఁబడినంతటి దుఃఖ మతనికిఁగలిగెను. తుదకు రాముని సందర్శించి యాతని నూరికిఁ బిలిచికొని వచ్చి పట్టాభిషేక మొనర్చుటకుఁ బ్రయత్నించెను. కాని పితృవాక్య పరిపాలనాదీక్ష వహించిన రాముఁడియ్యకొనక పోవుటఁజేసి యతని పాదుకలకుఁ బట్టముగట్టి మనశ్శాంతి పొందెను

ఈకవికిఁ గరుణారసమును బోషించుటలో నసాధారణ ప్రజ్ఞ యున్నట్లీనాటకము వలననే తెలియవచ్చుచున్నది. ఎట్టి కఠినహృదయునకైనను, దశరథుని పుత్రశోకము కంటనీరు తేక మానదు. ఆ పుత్రశోక మనుభవైకవేద్యమైనను, నీకవి దానినిఁ బ్రదర్శించుపట్లఁ జదువరుల శోకసముద్రమున ముంచుచున్నాఁడు. దశరథుఁడు తుదకుఁ బుత్రశోకమున మడిసెననుట కేవల సహజముగఁ గన్పట్టునట్లు నీకవి దశరథుని పాత్రను బోషించినాఁడు.

"సడలించుశోకంబు సాక్షి చాలకయున్న నేచచ్చినపుడైన నెఱుఁగవన్న"

అనిదశరథుఁడు తనసంతాపమును వెలిఁబుచ్చినపుడు పుత్రశోకము మూర్తీభవించి నట్లగపడుటయు నతఁడన్నట్లే యాశోకముచేతనే మృతి బొందుటయుఁ జూడనగు.

ఈకవియొక్క గద్యశైలి యనర్గళమై ద్రాక్షారసపాకమునఁ దనరి మృదుమధురమై పండిత పామరజన మనోరంజకమై నాటకశైలికి మిక్కిలి యుచితమై ముద్దుమూటగట్టు మాటలతోను సులలితములగు వాక్యజాలములతోను నలరారుచున్నది. ఈకవిచేఁ బోషింపఁబడిన

పాత్రముల పరస్పర సంభాషణశైలి మిక్కిలి యౌచిత్యము గలిగి కడుమనోహరముగనున్నది. నాతికఠినములై రసభరితములై శ్రావ్యములైన మాటలనే ప్రోగుచేసి ముక్తాహారములఁబోలు వాక్యముల నీనాటకమునందు నింపియున్నాఁడు. చదువరుల హృదయముల నాకర్షించి తనవెంటఁగొనిపోవుశైలి యీకవికబ్బియుంట యాతనిభాగ్యము.

ఈకవియొక్క పద్యశైలి మిక్కిలి మధురముగనున్నది శ్రవ్యకావ్యమగు ప్రబంధశైలి శక్తికిని దృశ్యకావ్య మగునాటకశైలి శక్తికిని దారతమ్యముండి తీరవలెనని యెంచి కాఁబోలు నీకవి మిక్కిలి సులభశైలినే పద్యముల నల్లినట్లు దోఁచెడిని. తానే నాటకరంగము నెక్కి పాత్రములఁ గైకొనిన నటశేఖరుఁడగుటఁ జేసి దిదృక్షుల హృదయముల నాకర్షింపఁ గలయట్టి సమయోచిత పద్యములఁ బొందుగొలిపియున్నాఁడు. ఈకవియొక్క కీర్తిచంద్రికలు దశదిశల వ్యాపించియున్న దనుట ప్రతియాంధ్రునకుఁ దెలిసిన విషయమే. కేవల నీతిబోధకములగు నాటకములఁ గడుసుబోధకములుగ రచించియుండుటచేఁ బ్రతియాంధ్రునియింట నీకవినాటకములు పఠింపఁబడుచుండుటను దఱచుగఁ జూడనగు. ప్రతిదినము నీకవిచేరచింపఁబడిన నాటకముల నేకముల యున్నకమే యాంధ్రుల కీకవినాటకములఁ బఠించుటలోఁగల యుత్సాహమును జాటుచున్నది.

ఈకవికీర్తి యాచంద్రతారార్కముగా విలసిల్లుఁగాక.





Bellary. D. KRISHNAMA CHARLU,
ANDHRA NATAKA PITHAMAHA,
Born 1853 —Died 1912.

శ్రీ

# పాదుకాపట్టాభిషేకము.

## ప్రస్తావన.

శా॥ శ్రీమీనాక్షివిలాససుందర ధరిత్రీ జాతమై సంతతం।
బ్బామోదంబు ఘటింపఁ దల్పఘననాగాధీశుఁడాసన్నుఁడై ।
సౌమిత్రిప్రథితాభిధానమునఁ దా నైదోడుగా నొప్పునా।
రాముండీవ్రతభక్తసంతతులకుం రారాజదైశ్వర్యముల్ ॥

అనుబంధము 1

సూత్ర—నటీ ! యిటురమ్మా.

[ప్రవేశము: నటి.]

నటి—ఆర్య ! సెలవేమి ?

సూత్ర—చూడు మీయెడ నానాశాస్త్రకోవిదులును, సంగీత సాహిత్య విశారదులునగు విజ్ఞమండలి చేరియున్నది. వీరిమానసములకింపగు విధానమున నేదేని నాటకముం బ్రదర్శింతమని యభిలాష వొడమి నీయోచనఁగోర యాహ్వానమొనర్చితి.

నటి—ఇందుకు నాయాలోచనయేల ? ఏదోయొక యాంధ్రనాటకముం బ్రదర్శింపుము.

సూత్ర—ఏదో నాటకమన్న నేమి ? భాషావైశద్యమునను, సంవిధాన చమత్కృతివల ననుసర్వజనముల మానసముల రంజింపఁదగు నాటకముగదా ప్రదర్శనీయము.

నటి—అయినఁజెప్పుము. పురాణకథయా, కల్పనాకథయా, లేక చరిత్రారూపకమా వీరిసంతోష పెట్టఁజాలినది ?

సూత్ర—ఏకథయయిననేమి ! రసస్ఫూర్తికలిగియుండవలయుఁగదా ? కథయెట్టిదయినను దత్కూర్తిఁగదా విచారింపవలయు ?

నటి—అయిన నాంధ్రనాటక పితామహఖ్యాతి జెందిన రామకృష్ణకవీంద్ర నాటకమే దైనఁ బ్రదర్శింపఁదగు.

సూత్ర—నాకు నట్లేతోఁచుచున్నది.

నటి—అయిన నేనాటకముం బ్రదర్శింప నెంచితివి ?

సూత్ర—ఆహా! జ్ఞాపకమువచ్చె. ఆకవీంద్రు డెన్నియో నాటకముల రచియించి యున్నాఁడు అందు విషాదాంతము కాకయుండినను బృథివియున్నయన్ని విషాద నాటకములకును మిన్నయన్నవన్నెఁగన్న చెన్నున మహర్షిపుంగవుండగు వాల్మీకి తనరామాయణమున నయోధ్యాకాండ రచియించియున్నాఁడుగదా. అందలికథయే తత్కవిపుంగవుండు నాటకరూపకమున రచియించియున్నాఁడు. దానిఁ బ్రదర్శింతము.

నటి—ఒకానొకప్పుడు మనము విచారించియుండలేదా యాకథలోని యంశములు? కొన్ని విషయముల సందేహములు తీఱలేదు. భరతుఁడులేనికాలమున దశరథుఁడు రాము పట్టాభిషేకకార్య మేలదలపెట్టవలయు? తలపెట్టెంబో మూఁడుదినముల ప్రయాణమని తెలియవచ్చిన గిరివ్రజపురమున నున్న భరత శత్రుఘ్నుల నేల పట్టాభిషేకమునకుఁ బిలువఁబంపలేదు? ఎన్నియేండ్లనుండియో మగనితో సంసారమొనర్చుచున్న కైకేయి యొక మంథర చెప్పినమాత్రముననే రాముపైఁ బగబట్టవచ్చునా? పోనీ! కైకేయి స్వభావమువలననే పాపకర్మ గాలా? లేక మంథర బోధన విశేషమా? మంథర కుఁ గైక మనసు ద్రిప్పునట్టి కారణము లేవి యెట్టివి చూపించె? కైకవరములడిగెఁగదా? రామునకు రాజ్యమీయకుండ నడుగవచ్చుఁగాక, యతని నరణ్యమునకుఁ బంపునట్లును, అట్లు పదునాలుగేఁడ్లును, అందునుఁ దపసివృత్తిమై నుండునట్లును గోరను కారణ మేమి? వరములిచ్చినను, భరతునేల తర్వాతనైనఁ బిలిపింపలేదు? తుదకు రాము డరణ్యమునకుఁ బోయినపిదపనైన భరతునకేల యీవృత్తాంతము చెప్పలేదు? అటుచెప్ప నంపియుండిన దశరథుఁడు మృతిజెందకమునుపే భరతుఁడే తెంచి రామునిఁ బిలుచుకొని వచ్చుచుండెనే. వీనికన్నిటికి సమాధానములం దగిపడవని యాలోచింపలేదా? అట్టిది నాటకరూపమైన నెట్లలరింపఁగలదు?

సూత్ర—ఏల యోచించెదవు? వీనికన్నిటికిని బ్రత్యుత్తరముల నీవిందుఁ బడయఁగలవు. ప్రొద్దుపోయె. ఇఁక నాటకమున కుపక్రమింతము. ఈనాటకమున నీకవి మంగళా చరణమునను మహాకవియగు వాల్మీకిం బ్రస్తుతించియున్నాఁడు. ఆకవీంద్రునకు సరస్వతి ప్రత్యక్షమనుటకు సందేహములేదు. ఆదికావ్యమన్నను, ఆదిప్రబంధమన్నను, ఆదినాటకమన్నను, దగినది యనిపించుకొను రామాయణము నామహాకవి రచియించి యున్నాఁడు.

ఉ॥ ప్రాకటమంజు సంస్కృత సరస్వతి ధీరపదార్థగౌరవా।
నేకతవిల్లసిల్లఁగవు లెవ్వరు వ్రేలిడ నేరకుండఁగా।
నేకవిలోకమౌళి రచియించెను రాముచరిత్రమట్టివా।
ల్మీకిలసద్వివేకిఁ జిదమేయపినాకి నమస్కరించెదన్ ॥

ఏదీ వానికిఁ బ్రత్యక్షముగనున్న యావాగ్దేవి నీవింత ప్రశంసింపుము.

నటి— అనుబంధము 2

సూత్ర—రమ్మింకఁ బోవుదము. (నిష్క్రమింతురు).

# శ్రీ

# పాదుకాపట్టాభిషేకము.

## పూర్వరంగము.

### ప్రథమప్రకరణము-అయోధ్య-దశరథునాస్థానము.

[ప్ర: దశరథుఁడు, సుమంత్రుఁడు, వసిష్ఠుఁడు, సేవకుఁడు.]

వసిష్ఠుఁడు—రాజేంద్రా! దేవేంద్రుఁడు నిన్నొక పనికై యర్థించుచు, తనసారథిని మాతలి నిందుఁ బంపియున్నాఁడు.

[ప్రవేశము: మాతలి]

మాతలి—దశరథరాజన్యా! విజయోస్తు. శంబరాసురుఁడు సురపురిపై దండెత్తి వచ్చుటకు సర్వసన్నాహములు చేయుచున్నాఁడని విని దేవేంద్రుఁడు నను నీయొద్దకుఁ బంపినాఁడు. ఇక్ష్వాకుకుల సంభవు లెల్లరుఁ దనకు బరమమిత్రులనియు, దానంజేసి నీవును బరమప్రీతి పాత్రుఁడవనియు నీవుతనకు సహాయునుగా రాఁగోరితివనియుఁ జెప్పుచున్నాఁడు. గురుప్రసాదమున శబ్దవేదిసాయకముల పరిచయము నీకలవడియుండుటచే నామాయావితో నీవ సంగ్రామముచేయఁదగుదువనియు నన్నాఁడు. ఈ వశిష్ఠఋషియు నినుఁ బ్రశంసించినాఁడు.

దశ—మాతలీ! నేనాయమరేంద్రుని భృత్య భృత్యుండను. రమ్మని యానతిచ్చిన శిరసావహింపుదు. కనదద్రిపక్షవిచ్ఛేద దక్షమై, వృత్రాద్యభ్యమిత్రగాత్ర లతాలవిత్రాయమానమైయున్న వజ్రముగల పాకారికిఁ జేకూడని సంగ్రామమొండుండునా? నను రమ్మనుట నాపైఁ బ్రీతివిశేషమ కాక అవశ్యమానతి నెఱవేర్చెదను.

క॥ చిత్రవిధంబునఁ బ్రీతికిఁ
బాత్రుఁడఁగా దేనిఁగో త్రపత్రహరునకా
వృత్రప్రభంజనున కతి
మాత్రమె శంబర సురారిమథనం బెందుఁ ॥

మాతలి—రాజేంద్రా! నీవాడినది నిక్కము. సమరము నిశ్చితమైన వెంటనే వచ్చెదను. పునర్దర్శనమయ్యెడు.

వసి—రాజేంద్రా! నేనును బోవఁదగియున్నది. పోయివచ్చెద.

మాతలి }
వసిష్ఠ } (నిష్క్రమింతురు)

దశ—సుమంత్రా! చూచితివే యింద్రుని యనుగ్రహము? నేను శబ్దవేది సాయకాభ్యాసమునకు సరయూతటంబునకుఁ బోయెద. దానికిఁ దగినట్లు చీఁకటిరాత్రులును వచ్చియున్నవి. నా మోహనాంగి కైకేయి నేను యుద్ధమాడుట చూడవలయునని యభిలషించినది. అదియు నెఱవేఱఁగలదు. ఇంకఁ బోదము. (నిష్క్రమి)



## పూర్వరంగము.

### ద్వితీయప్రకరణము-సరయూతటము.

---

[ప్రవేశము: దశరథుఁడు-ధనుర్బాణధారియై.]

దశ—ఇన్నిదినము లభ్యాసము దప్పినను మఱవలేదుగదా? అప్పుడే నాలుగు గజముల రెండుపులులఁ జంపితి.

(లోపల "బుడబుడ" యనిధ్వని)

ఆహా! మఱియొకగజము జలముద్రావుచప్పుడువినఁబడియె. ఇదెవచ్చెను. (బాణము వేయును)

(లోపల "హా! నారాయణ! హా! నారాయణ!" అనుధ్వని)

అయ్యో! ఏమిది. హా నారాయణ యనునార్తరావమువినవచ్చె.

(పోయిచూడఁగా నక్కడ యజ్ఞదత్తుఁడను తాపసపుత్త్రుఁడు పడియుండును.)

యజ్ఞ—హా! నారాయణ! నారాయణ! పండు ముదుసళ్ళ నాజననీజనకుల నింకెవ్వరరయువారు?

దశ—హా! శ్రీహరీ!—(మూర్ఛిల్లును)

బ్రా—ఎవరయ్యా యిక్కడ? మరణవేదనమున కోర్వఁజాలకున్నాను. నాయెద నాటిన బాణమునుత్పాటించువారు లేరా? మాజననీజనకులొద్దకు నన్నెవరైనఁగొనిపోరే.

దశ—బ్రాహ్మణోత్తమా! అరయక నీప్రాణమున కెసరువెట్టిన దుర్జాత్ముఁడ నేనే. వలసిన శాపమొసంగుము.

క॥ పాపాత్ముఁడనై యరయక
యీపాటొదవంగనిన్ను హింసించితినీ
శాపముపాలొనరింపుము
హాపాయముగలుగఁగాధరామరతనయా॥

బ్రా — హా శ్రీహరీ! శ్రీహరీ! ఈమరణాయాసమున కోర్వఁజాలను. పుణ్యాత్మా! ఈబాణము తీయుము. ఇదే దాపుననున్న మా వృద్ధాంధ జననీజనకులతో —

దశ — అయ్యో! నాయట్టి క్రూరకర్ముఁడుండునే.

బ్రా — అయ్యా! సహింపజాలను మాటలుండనిమ్ము. ఈబాణమును దీయుము.

దశ — బ్రాహ్మణోత్తమా! ఇప్పుడే శాపమొసంగి నన్ను —

బ్రా — అయ్యా! నేఁ బ్రాహ్మణుఁడఁగాను. శూద్రియందు వైశ్యునికి జన్మించినాఁడ. నీపుణ్యమగును ఈయలుఁగుఁదీయుము.

దశ — తీసెదను. నీజననీజనకులకేమి చెప్పెదవు?

బ్రా — ఏమి చెప్పఁగలను. అయిన నొకటిమాత్రము చెప్పవలసియున్నది. నిను క్షమింప నేవేఁడికొంటినని వచింపుము. తీయుమా యీనారాచము.

దశ — (దుఃఖించుచు బాణము వెలికొను)

బ్రా — హాజననీ! హాజనకా! నారాయణ! నారాయణ! (అని చచ్చును)

దశ —

## అనుబంధము 3

కట్టా! నేనెంత క్రూరాత్ముఁడను. ఎంతదుశ్చరితుఁడను. ఈపాపమున కేది ప్రాయశ్చిత్తము.

(లోపలధ్వని "యజ్ఞదత్తా" అని)

అయ్యో! యీతాపసపుత్రుని జననీ జనకులితని నరయుచున్నారు. వారివలననైనను మృతిఁ బొంద శాపముఁ గైకొందు. (నిష్క్రమి)



## పూర్వరంగము.

## తృతీయప్రకరణము-అదే నదీతీరమున నడవి.

---

కానడిలో వృద్ధాంధమైన తాపసమిథునమును బ్రక్కన దశరథుఁడును

మూర్ఛిల్లియుందురు

యజ్ఞదత్తు శవము నందేయుండును.

తా — హాపుత్రా! హాతనయా! ఇట్లు మమ్ము వబాసి పోఁగలవని మేమెన్నఁడైనా నెఱుఁగుదుమా? మా కులదైవము నీవు మాకు లేకుండఁ జేసితే.

తా — స్త్రీ — తనూభవా! వృద్ధులను నంధులనునైన మమ్ము కానడిలో నుంచుకొని యాయాసమునకు మోయుచువచ్చితివే ఇంకమమ్మెవ్వరు రక్షించుచున్నారు?

తా — అయ్యో! మాకేలయీ పాడు దాహముగలిగెను? ఊఁచినబోయినుఁడు మా ప్రాణముల గొడ్డంట్రఁ గొట్టినట్లాయెగా?

తా — స్త్రీ — తనూజా! నెలదినములుక్రిందట మాకిరువురకుఁ గలిగిన వ్యాధులవలననైనఁ జావమైతిమే. ఇదివాచుటకేకదా?

దశ — అనుబంధము 4

మునివతంసమా! నాప్రాణములన్నియు మీకేయర్పించుచున్నాను. ఈపాపభారము సహింపఁజాల. ఇప్పుడే నాయంతమొనర్పుఁడీ? ప్రార్థించెద.

తా — అయ్యా! మాప్రాప్తియిట్లున్నది. నీవేమిచేయఁగలవు? నీశబ్దవేదులు మాప్రాణవేధులుగా మాముద్దుతనయుని హృదయవేదన మొనర్చునవుడు వాఁడాడిన కడమాట యింత వచింపుమా.

దశ — హా! దుఃఖము దుఃఖము తాపసవర్యా! నా క్రూరకృత్యమునకుఁదగిన దండనమొనర్చితిరేని మీసుతుఁడాడిన మాట వచించెద

తా — ధరణీశా! మేమేమిశాపమొసర్తుము. ఆదైవమెయున్నాఁడు కరుణించిచెపుమా వాఁడేమనెను?

దశ — తాపసవర్యా! ననుదరిఁ జేర్చుటకు మీకు రెండే తెరవులు. శపించి నిగ్రహించుట యొకటి. లేదేని కరుణించి నాశుశ్రూష మీకొనరుని మారుగాఁ గైకొనుటయొకటి. ఈరెండవభంగియే మీకిష్టమైన రాజ్యమంతయు సన్యసించి మీకొడుకునకు మారుగా మిమ్ము మనినంత కాలము మోసికొని తిరుగాడుచు నాపాపములోని లవమైనఁ బాపికొనుటకై —

తా — ఏమిసౌఖ్యమని మేమీప్రాణముల భరించెదము. కాంతా! నాప్రాణము లిప్పుడే యుత్క్రాంతములగు నట్లున్నది.

స్త్రీ — నాథా! నాకునష్టమయిన నేమృతిఁబొందుటవరకు నింత భరింపుమా నీప్రాణముల.

తా — రాజేంద్రా! కడుపుణ్యమగును మావాఁడేను నెను చెప్పుమా యిప్పుడచచ్చెదము.

దశ — నన్నుక్షమింపుఁడు. నాశోంకయేదైన మీరానతింపకున్న నేఁజెప్పను.

తా — గాఢాగసమా! ఇట్టికటికి బుద్ధిదగునా? మానోటికడిదీసి నిరపరాధు మాకొమారు దెగటార్చి తృణార్ధమునఁ జావనున్న తలిదండ్రుల యాశాపూర్తనొనరింపవా?

మాలిని॥

భూపకులాధమ మూదగు ముద్దులపుత్రునినూరక చంపితివా!
పాపముచాలక మాసుతు మాటలఁబల్కవె నిర్దయమానసయీ
తాపముచేనడలొందికలంగి "సుతాసుత" యంచెటుచచ్చెదమో
యాపగిదిన్మరణంబుననాఁటి "సుతాసుత" యంచునెచావుమిఁకన్

శతవృద్ధులమైన మేము ఏకపుత్రవిషయమై యెట్లు "పుత్రా! పుత్రా" అని యఱచి చచ్చెదమో యట్టిప్రాప్తియే నీకుఁగలుగుఁగాక.

దశ — వాచంయమివర్యా! నాఘోరపాపమున కీయల్పశాప మెక్కుడి కొక్కను. అయ్యో! మీకరుణ యెంతని వచింపవచ్చును. నలువది యేండ్లనుండి యెన్నివివాహములైనను నెన్నిపూజావ్రతాదుల నొనర్చినను, బుత్రులగానక "పుత్రుడో పుత్రుఁడ" నియేకరుచున్న నాకు మీశాపవ్యాజమునఁ బుత్రునిఁ గలిగించితిరే. నాదుష్కృతము నీజన్మమునఁ దీఱ్పనీక చచ్చినరకముల పాలగునట్లు మాత్రమొనర్చితిరి.

ఉ॥ ఎన్నఁగరానిపాపమున కీక్రియ శాపమటంచుఁబుత్రసం
పన్నునిఁ జేయఁజాలితి రపత్యవిదూరుని నిట్లునింతురే!
మన్ననఁదాపసోత్తములమానస మానవ నీతతుల్యమం
చున్నతిఁబల్కఁబల్కులిటు చూడనిదర్శనమయ్యెమీయెడన్॥

ఇప్పుడు నిశ్శంకముగా మీపుత్రుని కడమాటవచించెదను. దుష్కర్ముఁడనైన నను నిదగ్ధునింగాఁ జేయకుండఁ దనమాఱుగాఁ మిమ్ము వేడుమనినాఁడు. ఇదియే! యతనిమాట. ఎంతటిదయాళుఁడో.

తా — స్త్రీ —
తా —
} హా! కుమారా! కరుణాకరా!
(చత్తురు)

దశ — హా! దైవమా! (అని మూర్ఛిల్లును) (యవనిక పడును)

శ్రీ

# పాదుకాపట్టాభిషేకము.

## ప్రథమాఙ్కము.

### ప్రథమరంగము-దశరథునాస్థానము.

[ప్ర: దశరథుఁడు-వసిష్ఠుఁడు-సుమంత్రుఁడు-సేవకుఁడు].

వసిష్ఠుఁడు—అట్లయిన నీయిష్టము నీ కభయముగానున్నప్పుడు కానిమ్ము.

దశ—భయమునకుఁగాదు, నాకేమో చేయవలయుననియే తోఁచుచున్నది.

వసి—రామునితో మాటలాడియున్నావా?

దశ—ఎక్కడిది? నేఁడుదయమునఁగదా నాకుఁదోఁచినది. నిన్నరాత్రివఱకు నీప్రశంసయే లేదే—సేవకా! రాముని బిలిపించుము. భరతుఁడు లేఁడనునదిమాత్రము చింత నీయకు. ఈదుస్స్వప్నఫలము ఘోరమని నీవేయంటివే. కావున నాకీఁడును రాఁగముందే యీకార్యమొనర్పవలెనని బుద్ధిపొడమినది.

[ప్రవేశము: రాముఁడు]

రామ—(నమస్కరించి కూర్చుండును).

దశ—రామచంద్రా! అఱువది సంవత్సరములనుండి పృథ్వీపాలన మొనర్చి యెనుబది యేండ్లుమీఱిన వృద్ధుఁడనైతిని. ఈచైత్ర శు॥ ౯ యే శుభదినముగా వసిష్ఠులు నిశ్చయించినారు. నీపట్టాభిషేకమునకు నీవంగీకరింపవలయు.

రామ—జనకా! ఉన్నట్టుండి యిదియేమి? ఇంక నేబదియేండ్లయినను రాజ్యమేలుటకు సమర్థుఁడవై నీవుండ నాకేటికీప్రయాస యిప్పటినుండి?

దశ—తనయా! నీకుఁబదియు నెనిమిదవయేఁడు సమీపించె. ఈశుక్లనవమికిఁ బదునేఁడు నిండుఁగదా? చిన్నవయసున రాజ్యమేలఁగలిగినఁ బ్రజల సుఖదుఃఖములు చక్కఁగా నెఱుఁగవచ్చుఁగదా?

రామ—జనకా! నీమాట జవదాటువాఁడనా? అయినను క్షమించుము. నేఁడు పిగియగదా? ఈమూఁడుదినములలోఁ బట్టాభిషేకము కావలసినంత త్వరయేమి? అదియునుగాక భరతశత్రుఘ్నులును లేరు. వారులేక యీకార్యమును జరుపుటకు నాకుఁగుతూహలముండునా? ఈలగ్నము కాకున్న మఱియొక లగ్నమాయెను. నన్నుమన్నించి వారలఁ బిలువంపుము.

### అనుబంధము 5

తే॥గీ॥ చెలువుమీఱంగఁ బట్టాభిషేకవేళ
నెవ్వరెవ్వరో పెఱవారలేగుదెంచు
వారుగా యట్టిచోఁగూర్మిఁ గారవించు
చిన్నితమ్ములు లేకుండఁ జేయ నేల॥

వసి—రామా! నేనెంతయుఁ జెప్పితిని, నిన్నరాత్రిఁ గలిగిన యొక కారణమున మీజనకుఁడు నీకుఁ బట్టాభిషేకము చేయఁగోరినాఁడు. దినముల నాలోచించిచూడ రేపు పంచమి తప్ప మఱి దినము దొరకదు. కావున విధిలేక వచ్చినది.

దశ—పుత్రా! నేనంతయు నాలోచించియే యున్నాను. భరతుఁడు లేక నిన్నభిషిక్తునిఁ జేయవలెనని నాకేమికోరికయా? పదిదినములక్రిందట నీబుద్ధిగలిగియుండిన భరతుని గిరివ్రజపురమునకు నే వేల పంపుచుంటిని. ఈశుద్ధనవమికి నీపదియునెనిమిదవ యేఁడు పడును. సంవత్సరమున నభిషేకము చేయరాదని యార్యులందురు. రాఁగల సంవత్సరమునఁ జైత్రమాసమున గురుమూఢము రాఁగలదఁట. తర్వాతఁ జాతుర్మాస్యలనొనర్ప రాదు. మఱల మాఘమాసమున శుక్రమూఢము రాఁగలదఁట. చైత్రమాసము వఱకు నదియుండునఁట. ఇంతలోన నే యిరువదియవ సంవత్సరము గాఁగలదు. కావున నావత్సరమంతయు సరిపడదు. ఇట్లు మూఁడేండ్లు కడచఁగలవు. కావున నిట్లు ప్రయత్నించితిని.

రామ—మూఁడేండ్లు కడచిననేమి? పిదపనే కానిమ్మమియవసరము,

దశ—పుత్రా! అట్లుకాదు. ఊరక మాస్వర్యము మానియున్నవాఁడనా? శీఘ్రముగ నే నీకుఁ బట్టముగట్టవలసిన కారణములు నిన్నరాత్రిఁ గలిగినవి. అవియన్నియు నీకెఱిఁగింతు లెమ్ము. అయిన నావృత్తాంతము నీవు మీతల్లులతోఁ జెప్పకుము. భీతిల్లుదురు. కావున విధిలేకున్నది. ఇది నీవొనర్పకున్న నామతాహాభంగము గాఁగలదు.

### అనుబంధము 6

క॥ ఎన్నాళ్ళకు మున్నోఁచి నీ
కెన్నితిఁ బట్టంబుఁ గట్టనెల్లేకడచెన్
మిన్నక కాలం బికనో
యన్నా సలుపంగఁ గూడదాలస్యంబున్॥

క॥ ఊరక యోచింపకుము కు
మారక యీ కార్యమైన మాటచేకూరుటకై
గోరిక లెల్లను దీరుఁగ
భారము నా వాంఛితంబు వాటింపఁగదే॥

రామ — నీయాజ్ఞకు వ్యతిరేకముగలదా? నీయిచ్ఛ తెలుంగునదే కానిమ్ము.

దశ — మంత్రీ! సుమంత్రా! రేపు బుధవారముననే పట్టాభిషేకము కావలసియున్నది. నేఁడిప్పుడే భానువారమాయెను. సర్వసన్నాహములు నీవెట్లుచేయఁగలవో. పుత్రా! ఏల యాలోచన?

రామ — భరత శత్రుఘ్నులు లేరుగా యనియే.

దశ — ఏమిచేయవచ్చును? అక్కడికిఁ బోవనే మూఁడునాళ్లకుఁ దక్కువకాకుండఁ బోవును. యత్నములేదు. పోదమురమ్ము. (నిష్క్ర-9)



## ప్రథమాఙ్కము-ద్వితీయరంగము.

### కైకేయియిల్లు.

[ప్రవేశము: మంథర].

మంథర — ఆహా! పురమంతయు నలంకరింపఁబడుచున్నది. ఎవ్వరుచూచినను నగుమొగము లలగార స్వర్గమేలఁగలిగినట్లు సంతోషభరితులైయున్నారు. రామునికిఁ బట్టాభిషేకమఁట! రామునికఁట! పట్టాభిషేకమఁట! రామునికిఁ బట్టాభిషేకమైన నీజను లందఱకేమి? తమకే యభిషేక మగునట్లుత్సాహముఁ జెందియున్నారు! ఈదుఃఖము నేఁజూచి యోర్వఁగలనా? నేనిందుఁ గైకేయి వెంటవచ్చినదిమొదలు దుఃఖముసకే కారణమైయున్నది. నేనెవ్వరికేమపకారముఁ జేయకున్నను, బురజనులందఱు నను దిరస్కరించెదరు. ఒక్కరైన నాచెలిమిఁగోరరు. ఒరులచెలిమికోరి నేఁబోయినను నను జేరనీరు. నేబోయితినా మాటలాడుచున్నవారందఱు మాటలుడిగి నేవెడలి వచ్చువఱకు మౌనముద్రవహించెదరు. ఒక్కరిమాట లితరులకుఁ దెలిసెనా, మంథరయే చెప్పెనని మొత్తికొందురు. ఇండ్లలోరహస్యములేమయిన మాటలాడ వలసి

వచ్చినం దొలుత వెలుపటికివచ్చి నేనేమైన నున్నానాయని చూచి పిదప మంతనము లాడెదరు. నేం గాలుద్రవ్వి జగడమునకుం బోయినను, నాకిడ్లువేసికొందురుగాక, తిట్టుటకైనను నాతో మాటలాడరు. అందఱు నన్ను నికృష్టపుం జూపుచూచెదరు. కైకయొక్కతెయే నన్నేమియు ననది. దానికిని నీనడుమం దిగులుగలిగియున్నది. ఎవరేమిచెప్పిరో ? తనమగనితో నున్నప్పుడు తప్ప మిగిలిన యన్నివేళల దానినేమఱకున్నానే. ఎవరుచెప్పంగలరు ? ఆమగనితో నున్నప్పుడును, నేమఱుండుటకై వారి గదికి వాంకిం దెలియకుండ గండిపెట్టి వారిమాటలన్నియు వినుచున్నానే. కావున దశరథుండైనను నాపైం జెప్పియుండు ననుటకవకాశమె లేదు. ఏమోయేమియుం దెలియకున్నది. నన్నుగన్న మఱంగించి యెవ్వతె చెప్పియుండును ? నన్ను మించినవారు నున్నారుగా యీయూరం ? ఆహా ! తెలిసెను. నన్ను రాముండు పుట్టచెండుతోం గాలువిఱుగ వేసియున్ననాండు కాలునొప్పివలన నేంబండుకొనియుండిన కాలమున, కౌసల్య యీకైకతో మంతనములాడియుండెను. దానియింటికిదె పోయియుండెను. అయిన నిదిజరిగి నాలుగేనెల్లాయెనే. కైకకీబుద్ధిపుట్టి నాలుగైదు నెలలాయెను. ఇట్టిపిచ్చచోట నాకేమిపని పోదమని యెంచియుండియు, నను దిరస్కరించు నీపు. నాంబోక గుఱుతైనం జేయకపోవచ్చునా యని వేచియుంటిని. ఇప్పుడు సమయమబ్బెను. రామునికిం బట్టాభిషేకము ! ఆజ్యపట్టాభిషేకము చేయించెదను. దానికై యెగురులాడుచున్న యీపురవాసుల కశ్రుజలాభిషేకముం గావించెదను. అప్పుడయోధ్యవాసులందఱు మంథర ప్రభావముం దెలియునే — ఈకైక కేమి రిమ్మయో యిదియు నెగురులాడుచున్నది. ఇదె వచ్చెను.

[ప్రవేశము: కైకేయి].

కైక — మంథరా ! ఇక్కడ నేమి చేయుచున్నావు ?

మంథ — నీవేమింత సంభ్రమముగం బోవుచున్నావు ?

కైక — రామచంద్రుని పట్టాభిషేకమని నీవు వినలేదేమో ?

మంథ — ఆహా ?

కైక — అదియే యిక్కడనున్నావు నీవు ?

మంథ — బండికొఱకు పంపియున్నాను. నిరీక్షించుచున్నాను.

కైక — బండి యేమిటికి ?

మంథ — ఊరికిం బోవుటకు.

కైక — ఏయూరికి ?

మంథ — గిరివ్రజపురమునకు.

కైక — ఎవరియొద్దను?

మంథ — మీతండ్రి కేకయరాజునొద్దను.

కైక — ఏలపోయెదవు?

మంథ — మనసు పుట్టినది గనుక పోయెదను.

కైక — అందుఁబోవ మనసేల పుట్టెను?

మంథ — ఇందుండ నిష్టము లేనందునఁ బోవ మనసుపుట్టెను.

కైక — ఇట్టిమాటలేటికే? ఇన్నాళ్లుండిన యిష్టము నేఁడేల లేకపోయె?

మంథ — నేను, కౌసల్యదాసికి దాసి గానుండఁజాలను.

కైక — కౌసల్యదాసియెవరు?

మంథ — నీవు.

కైక — నేను కౌసల్యదాసి నెట్లగుదును?

మంథ — రామునికిఁ బట్టాభిషేకమైన నీవు కౌసల్యదాసిగాక యింకెవ్వరు?

కైక — మంథరా! ఇట్టిమాటలాడకుము. ఆరామునిపై నీవు పగసాధించెదవా? చిఱుతఁదనమునఁ గంగుకరుతో నిన్నుఁ గొట్టిన మాత్రముననే యిట్టిపగవలయునా? ఆరాముఁ డెవ్వరనుకొన్నావు? నాకూర్మిసుతుఁడు. వానికిఁ బట్టాభిషేకమయిన నాకుఁ బరమ భాగ్యముగదా?

మంథ — (ఏడ్చుచు) కైకా! నీకేమిబుద్ధిపుట్టెనే? ఎవరెట్టిమందు పెట్టినారే నీకు? నీమస్తకముఁ ద్రాచుబిగిఁచుచున్నది నీవెఱుఁగకున్నావు. కాళ్లక్రిందఁ ద్రవ్వి గుంట చేయునది కనలేవు. మిత్రుల నమిత్రుల నరయలేవు. వినాశకాల మాసన్నమైయుండ నీవెవ్వరిమాట లేలవిందువు! నాకేమయినదని నీయిచ్చచొప్పునఁ జెడిపోవనిత్తుఁగాని మీతండ్రి నిన్నత్తగారింటికిఁ బంపునపుడు నిన్ను నాకిల్లడ పెట్టినాఁడే నేనెట్లూరకుందును? రామునిపై నాకుఁ బగయంటివే. ఇన్నిదినములయినదే యొక్కనాఁడైన వానిప్రస్తావము నీయెదుటఁ దీసియున్నానా? నాకన్నుల నీవుచెడిపోవుట చూడఁజాల. కావునఁబోయెద.

కైక — మంథరా! నీవేమన్నను నాకా కౌసల్యసుతునిపైఁగూర్మిమానదు. అయ్యో! రామునా నీవిట్లనవలయు?

## అనుబంధము 7

మంథ — కూర్మియేలమానుదువమ్మా? ఆకౌసల్య నీకు సవతి గాదు. తోఁడఁబుట్టువు. అయ్యో! ఆకౌసల్యపై నింతపడి మెత్తికొందువే అదినిన్నుఁ గాలిగోరంతైనను సరకుచేయునా? నామాటలిప్పుడు నీవేలవిందువు! రేపుఁ బ్రొద్దున రాముఁడు చక్రవర్తియై, భరతుఁడు

చక్రవర్తియై, వానిచరణములు శిరసావహించి యూడిగము సేయునప్పుడైన నన్నుఁదలఁపవా? జనులందఱు నిన్నుఁ జూచి "ఈకైక తనకు సరియెవ్వరనియుఁ గౌసల్యాదులకంటెఁ దనపైఁ బతికెక్కువ కూర్మియనియుఁ గర్వించుచుండెఁగా? ఇప్పుడుగదా యిదియొక భోగినియనుట స్పష్టమాయెను" అని వచించుచు ముసిముసి నవ్వునప్పుడైన నను దలఁపవా? కౌసల్య చక్రవర్తిమాతయై "కైకా! యిటువచ్చి కాళ్లొత్తు"మని నిన్నుబిలువ "కౌసల్యాదేవీ! భాగ్యము" అని నీవు బానిసతనము చేయవలసివచ్చినపుడైన నన్నుఁదలఁపవా? ఏమిసాత్త్వికము! యెంతెక్కువగు కొలఁది బుద్ధి తక్కువగుచుండునుగదా?

కైక — మంధరా! ఏలయీమాటలు?

చం॥ జగదభిరాము రాముని ననంతతిసాగరపూర్ణసోమునిన్
వెగటెద వేటికిట్లు విననేఁగదా యిటువంటిమాటలన్
మగువరో యోలయింతపగమానుము నాకు హితంబుగూర్తువే
సిగరువమౌర రామునకె నెయ్యము మీఱశుభంబుఁగోరుమా.

రాముఁడు భరతునికంటె నాయెడ నెక్కువభక్తిగలవాఁడు. కౌసల్యతోడఁబుట్టువునకంటె నెక్కువగా నన్నుఁజూచును. పినట్టివార్లైనను నాపతియుండలేదా? వారికి బుద్ధిగఱపరాదా?

మంధ — నీపతి — పనీపతి — అతని చరిత్రము తెలిసియుండిన నిట్లాడుదువా? చెప్పిన నేనే యోగ్యురాలనగుదు.

కైక — ఏమిచరిత్రమే? దాఁపక నాకుఁజెప్పుము.

మంధ — అదియుండనిమ్ము. నీపతి నీయందిచ్చగలవాఁడే కానిమ్ము. రాముఁడు రాజ్యమేలుకాలమంతయు నతఁడు బ్రదుకగల డనుకొన్నావా? శతవృద్ధుఁడై కాటికిఁ గాలుసాచియున్నవాఁడెన్నిదినములు జీవించియుండగలఁడే?

కైక — (హాఁ! హరి! యని చెవులుమూసికొని)

## అనుబంధము ౪

క॥ ఆహాహా యిదియేమిటి
నాహాసవాక్యంబె యింతసంతోషమునిం
తేహాఁహారి యెటులోర్తుదు
రాహాతి యిటులాడ మంధరా! నీకగునే॥

మంధరా! ఎట్టి కర్ణకంటకములగు భాషణములాడెదవే.

మంథ—అమ్మా! క్షమింపుము. తప్పాడితి. నీపతిస్థిరజీవి. బ్రహ్మవచ్చినను, నతఁడు చావఁడు. ఉన్నమాటయున్నట్టన్న నుఁడూరచ్చిరాదందురుగా? నీపతికలకాలముమని యుండినను, నతనిమాటేమైన జరుగఁగలదా? సార్వభౌముఁడైన రాజు వేఱె యుండఁగా నతఁడేమైన ననిన నతఁడును నీతోఁగూడ నిల్లువెడల వలసినవాఁడేగదా! కైకా! నీకేమిమరులే. నీకేమజ్ఞానమే. నీపతిచరితము చూచిచూచి యిట్లుమోసపోయెదవు.

కైక—ఏమే నాపతిచరితము? నాకొక్కటియుఁ దెలియదు.

మంథ—తెలిసియుఁ గన్నులు తెఱవకున్నావు. నీపతికి నీపై మోహముగలదని యెంచియున్నావా? చెప్పుము.

కైక—నాకేమియు సందేహముతోఁపదు.

మంథ—కైపు తలకెక్కినప్పుడేల తోఁచును. పోనీ, నీకొడుకుపైన నతనికిఁగూర్మి కలదా?

కైక—అదియేమే? అతనికి రాముఁడువేఱె భరతుఁడువేఱెయా?

మంథ—కైకా! లోకమున నందఱు నిన్నుపాయ శాలినియందురు ఇందులకా? భరతుఁడు మీయయ్యగారి యూరికిఁబోయి యెన్నిదినములైనది?

కైక—పది దినములైనది. ఇప్పుడేల?

మంథ—ఇప్పుడుగదా పట్టాభిషేకము. వాఁడులేకుండ వానివేఱూరికిఁబంపి యిప్పుడు పట్టముగట్టనెంచినాఁడే చాలదా?

కైక—మనము వినలేదా శుభదినము లింకఁగలుగవని దశరథుఁడు త్వరలో నీకార్యము తలపెట్టెనని?

మంథ—నీకెట్టి విశ్వాసగుణమే? మూఁడుసంవత్సరములనుండి మీతండ్రికోరుచున్నాఁడే యిప్పుడాభరతుఁ బంపవలయు?

కైక—భరతునిఁ బంపునపుడీప్రశంసయే లేదుగదా?

మంథ—కోడిపాలు పితికి తెచ్చినామన్నఁ జేఱపెట్టుమను దానవుకదా నీవు? ఈపట్టాభిషేక ప్రశంస యెన్నఁడునులేక యిప్పుడే టక్కునఁబుట్టెఁగా? ఇప్పటికి సంవత్సరము క్రిందటనే రామాదుల వివాహములు చేసికొనివచ్చినపుడే రామునికిఁ బట్టాభిషేక మింతలోనే చేయవలయునని నీపతియన్నట్టు నివేచెప్పితివే. మఱచితివా?

కైక—అపుడు మాటకలిగెను. తర్వాత మఱచియుండరాదా?

మంథ—ఈయుక్తి దశరథునికైనఁదోఁచియుండదు. పోనీ! భరతుఁడులేక యీకార్యము చేయనున్నాఁడే నిన్నొక్కమాటయిన నడిగినాఁడా?

కైక—నాయొద్ద కింకనురాలేదు. వచ్చినపుడు చెప్పునేమో.

మంథ—"చెప్పనేమో" భరతుఁడులేక యీపని చేయునందులకు నిన్నూగా క్కుటపోయె. నినువేఁడుకొని నీయనుజ్ఞవడయుటపోయె. నీవొడఁబడకయున్న నీకాళ్లపైఁబడుట పోయె "చెప్పనేమో" కదా! భానువారమునాఁడుగదా యీప్రశంసగలిగె. ఆగా ? నీనాథుఁడెందుండె?

కైక—కౌసల్య యింటనుండెను.

మంథ—ఇక్కడికివచ్చి నోటిమాటైన నీతోఁజెప్పడాయెఁగా.

కైక—మొన్న కౌసల్యవంతుగదా?

మంథ—వంతు. వంతెన్నఁడుఁదప్పెఁడో నీమగఁడు?

కైక—విధిలేని సందర్భము గలుగకున్నఁ దప్పఁడు.

మంథ—భరతునిఁబంపి నాల్గుదినములైనను గాకయుండె గానని సుంకమోయించెనే ఏ నాఁడే. ఈమాట నీతోఁజెప్పవలయుట "విధిలేనిసందర్భము" కాదుగా? నీవిఁకను "ప్రీతి" యనెదవు!

కైక—ఏల యిట్టి నిష్ఠురము లాడెదవే? నేనుఁజాలను.

మంథ—పోనీ! నిన్న సుమిత్రదగ్గరగదా వంతు? ఎందుండెను?

కైక—సుమిత్రయింటనే—కాదు నిన్నను కౌసల్యయింటనే యుండెనని వింటిని.

మంథ—ఇక్కడ వంతుదప్పనట్టి విధిలేనిసందర్భమేమున్నది?

కైక—(యోచించుచు మాటాడదు)

మంథ—(స్వ) ఇప్పుడు కొంచెము మార్గమునకు వచ్చుచున్నది. (ప్ర) నీవూరకున్న నేఁ జెప్పెదవినుము. ఆకౌసల్య కుమారునిపైఁ గూర్మివలన నేకదా నిన్నును సంగోడుట! ఇంకను బట్టాభిషేకమయినంగాలేదే. అప్పుడేవంతుదప్పనంత కూర్మిగలిగిన యిక నెట్లుండును?

కైక—హా? శ్రీహరీ! మంథరా యిప్పుడుస్మరణకు వచ్చుచున్నది.

మంథ—నీస్మరణపై మన్నుపోసిరి. మేలుకోరి బుద్ధిచెప్పవచ్చిన నాపై (ఏడ్చుచు) రాముపైఁబగగట్టితివి. దాసినగాఁజేయనున్న కౌసల్య యుత్తమోత్తమయంటివి. ఆవంతైన నిను సరకుసేయని పతినాథునికి మోసుకపోవునంత ప్రీతియంటివి. నేనా యింటనుండను. పోయెదను. (లేచును)

కైక—మంథరా! సనుక్షమింపుము. కరుణింపుము. నీకంటె నాకాప్తులెవరున్ నిలుమ్ము. (పట్టుకొని నిల్పును).

మంథ—నీకు హితులహితులగు కాలమువచ్చియున్నది, మాతల్లి గొడ్రాలన్న నట్లనా యని విశ్వసించుబుద్ధి గలిగియున్నది. నీయింట నేనుండనే యుండను. (విసరును).

కైక—(మంథర చరణములు పట్టుకొని).

అనుబంధము 9

మంజభాషిణి॥ ఊరియాపునాదుమది యూరడిల్లునా
వెరవింతచూపికడు ప్రేమనింపవే
యిరవారనాకునిక నెవ్వరే సఖు
ల్నిరసింపనోనె కరుణింపుమంథరా॥

మంథరా! ఇట్టి సమయమున నను జేయివిడువ వచ్చునా? నమస్కరించి వేడికొనెదను. పోకుము.

మంథ—(కూర్చుండి) ఇంకేమిచేసెదవు? మించిపోయె. నిర్వాణదీపమునకుం దైలము పోసిన నేమిప్రయోజనము?

కైక—మంథరా! నీవుదప్ప నన్ను సంరక్షించువారు లేరు. దీనికేమైన యోచనయున్నం జెప్పుమా.

మంథ—వెన్న చేతంబట్టుకొని నేతికివెదకెదవే? అంతయు నీస్వాధీనముననే యున్నది.

కైక—నా స్వాధీనమున నేమున్నదే?

మంథ—భ్రాంతా! దేవాసురుల యుద్ధమునాఁడు నీమహోపకారమునకు మెచ్చి నీకు రెండు వరముల నీపతియీయఁడా?

కైక—ఆహా! మఱచియుంటినే. భూపతిం బ్రార్థించి కోరుట కిప్పుడే యొకవరమడిగెదను.

మంథ—మిగిలిన యొకటి నేమిచేసెదవు?

కైక—ఇంకొకప్పుడైన నుపయోగమగుంగదా?

మంథ—బుద్ధిశాలినివి! ఆపని మడుగుటకంటె నూరకుండుము. ప్రసంగవశమున రెండు నిప్పుడే యడుగుము.

కైక—మఱియొకవరము నేమనియడుగుదును?

మంథ—కైకా! నేను దీర్ఘయోచన చేయక మాటాడననుట నీ వెఱుంగవుగా? మాటలు కఠినములైనను సుపాయమును మనసున నుంచవని నీ చెప్పనొల్లవుగదా! నే నేమయినం జెప్పిన నీకుఁ గోపమురాదుగదా?

కైక—మాతల్లిమాఱుగా నీవున్నావు. నీవేమన్నను హితార్థమని భావింతుఁగాక కోపముగలుగునా?

మంథ—ఆ రెండవ వరమునకు శ్రీ రాముని బదునాల్గేండ్లరణ్యమునం దపసి వృత్తి నుండం బంపఁగోరుము.

కైక—హా! శ్రీహరీ! (చెవులుమూసికొని) మంధరా! ఎంతమాటాడితివే! ఎట్టిపాపము వినిపించితివే! భరతునకుఁ బట్టముగట్ట నడిగిన నడుగవచ్చుఁగాక రామునరణ్యమునకుఁ బంపనెట్లు వేఁడుదును? నానోరెట్లాడును? రాముఁడే! భక్తికరుణాధాముఁడే! ఇనవంశాబ్ధిసోముఁడే! రూపజితకాముఁడే! అతఁడా యరణ్యములనుండవలయు? నాచేతఁగాదు. వలయునన్న భరతుఁడే యరణ్యముననుండనీ. వాఁడు రామదాసుఁ కాడేకానీ. నేను కౌసల్యదాసినైన నగుదుఁగాని, యట్టిదుర్చరితమునకు నేనియ్య కొందునా.

కం॥ అయ్యెడ రాజ్యబహిష్కృత
నయ్యెదఁ గౌసల్యదాసినైన నకట! నా
నెయ్యపు సుతునిఁగానల
కయ్యో! పనుపంగ నెట్టులడుగుదు?నబలా!

మంధ—రాముఁడే—కైకేయీమనోబ్జసోముఁడే. రాజ్యసర్వస్వకాముఁడే. కుత్సిత గుణధాముఁడే-నన్నేలనిల్పితివి? రాముఁడు కానలకుఁబోవకుండిన భరతునకుఁ బట్టాభిషేక మెట్లగునని యింతతెలియఁజాలవే.

కైక—మంధరా! అదియేలకాదు?

మంధ—ఇట్లడుగుము. యుక్తియున్నఁగైకొనుము. మూర్ఖ్యము మాత్రముమానుము. నీకు వరమిచ్చినఁ బట్టాభిషేకమునకు భరతునిఁ బిలిపింతురుగదా? అప్పుడు రాముఁడుండిన నీయూరకుండలు దశరథుఁడు కౌసల్యయు యూరకుందురా? భరతునివేఁడికొని గ్గైన రామునికిఁ బట్టముగట్టింతురు. అప్పుడు నీవు వరమడిగి చెడుగుమాత్రముగట్ట కొందువు.

కైక—నీమాటల నెంతయుక్తియున్నను, క్రూరకర్మముగదా? తపసివేషమున నేల యుండఁగోరవలయు? పదునాల్గేండ్లేల కోరవలయు?

మంధ—ఊరక యవివేకమునఁగాని, క్రోధమునఁగాని, యీవరముఁ జెప్పితినని యెంచకుము. రాముఁడరణ్యమునకుఁ బోయినను భరతునిలోఁజేసికొని దశరథుఁడు వాని బిలిపించి పట్టమొసఁగకుండును. అట్లొకవేళ రాముఁడు వచ్చినను తపసివేషముండ కుండిన రాజ్యమేలునేమోయను భీతిచేతను, నీవరమడుగఁ జెప్పితిని.

కైక—నీమాటలు నాకుఁదెలియవు. పదునాల్గేండ్లయినపిదప రాముని బిలిపించి రాజ్య మీఁగూడదో దశరథుఁడు?

మం.థ — కైకా! లోకవృత్తమింతైన నీకుఁ దెలియదా? వీఁడు దశరథుఁడెన్ని దినములు బ్రతుకఁగలఁడని యెంచియున్నావు? పదియేండ్లుండును. ఇంకను నెక్కువైనఁ బండ్రెండేండ్లును. నేనింకను రెండేండ్లెక్కువగా నుండియున్నానే.

కైక — మంథరా! —

మంథ — తాళుము. ఒకవేళ నింకను నెక్కువనాళ్లు బ్రతికినను. బహునాళ్లెట్లు రాజ్యమేలినవాని దప్పించుట సుకరముగాదు. అదిగో! పల్లకిమోయువారలధ్వని వినుపించుచున్నది. నీమగఁడు వచ్చుచున్నాఁడు. ఇంకఁ దడయకుము. ధైర్యము వదలకుము. రాముని బంపువరమే తొల్తనడుగుము. సమీపమునకే వచ్చెను. పొమ్ము-కోపము పైఁజేసికొనుము. పొమ్ము-పొమ్ము.

కైక — (నిష్క్రమించును)

మంథ — ఇంతమట్టునకు మార్గమునకుఁ దెచ్చియున్నాను. ఇంకఁ దిరుగఁజాలదు. అగ్ని పెట్టితిని. పొగరాఁజుచున్నది. దానిమంటఁ జూచు భాగ్యము నాకుఁ గలుగునా? ఇంక రాముఁడు పట్టాభిషేకము చేసికొనుఁగాక! దశరథుఁడును గౌసల్యయుఁ గన్నులు చల్లఁగఁ జూచెదరుగాక! ఊరిముండలందఱు నెగులాడుచుఁ బోయెదరుగాక!

[ప్రవేశము: దశరథుఁడు.]

దశ — మంథరా! కైకయెందున్నది? ఇల్లంతయు వెదకితిని.

మంథ — (నిట్టూర్పు విడుచును)

దశ — అదియేల యీనిట్టూర్పు. కైకకేమైన నాపదగలిగెనా?

మం.థ — అదియేమియు లేదు? మీ కైక యాకోపగృహమున నొక్కతెతోడను మాటలాడక పండుకొనియున్నది.

దశ — ఏమీ-ఏమీ-నేఁబోయి విచారింతును. మంథరా! నీవిందే యుండుము. (పోవును)

మంథ — (తలఁద్రిప్పి) ఉండెదను లెమ్ము—

[వెనుక యవనిక నెత్తినంతఁ గైకేయి, గాసిల్లి పండుకొనియుండును].

దశ — (కైకయొద్దకువచ్చి) తరుణీ! ఈవిధమేమి? నీవిట్లుండుటకుఁ గారణమేమి? రాకాసుధాకర బింబమునుబోలు నీముద్దుమోమేటికి నేఁడు వాఁడియున్నది? తెలివి కలిమిఁ జేపట్టినవాని ధన్యుఁజేయు నీకన్దామరలేటికి కన్నీజలముల నిండియున్నవి? నేవచ్చిన వెంటనె ముదమారఁ జిలుకల కులుకు పలుకుల "నాథా! ప్రాణేశా" యని పిలిచి నానావిధంగ నానందమునించు నీమోముదమ్మి నేఁడేల మౌనముద్ర వహించియున్నది? ఏతెంచిన వెంటనే మానక యెల్లవేళల నన్నాశ్లేషించుచుండెడి నీ కేలు

దోయి నేఁడేల యొకటినొకటి పీడించుచున్నవి? విలువగల జిలుగు వలిపట్టువలువలు మాని యీప్రాఁతచీర నేఁడేలవచ్చె? ఒక్కొక్కటి యొక్కొకజగమునైన వెలకుఁ గొనఁగల బలుసొమ్ములు నేఁడేలమైఁబూనవు? అవి యేమపరాధమొనర్చె? కాంతామణి! ఎవ్వరివలన నీకీపరిభవము గలిగె? ఎవ్వరునీమది నొవ్వఁజేసిరి? బుద్ధిలేని ముగ్ధచిలుకవోలె సమ్మదమ్ముగ్రమ్మ నెమ్మివోలె సంచునించు నంచవోలె నిన్ను నే జూచికొందుఁగా? అట్టి నీకపరాధమొనర్చినవాఁడెవఁడు? లక్షప్రాణముల నించుకైన సాకుసేయని యాక్రూరాత్ముఁడెవఁడు? కామినీ! నీయాజ్ఞయించుక కలిగిన దరిద్రుఁడైన నింద్రుఁజేయఁజాలుదు. ఇంద్రుఁడైన దరిద్రుఁజేయఁజాలుదుఁగదా? ఒక్క మాటాడుమా. నీవగపునకుఁ గారణమేమి? తరుణీ! ఏలపలుకవు?

## అనుబంధము 10

కైకా! నయనప్రభాకాంతకలిత సారంగశాబకా! శిరోజాతసమంచితశిఖా నిరాకృత చంచరీకా! పయోధరయుగళనిర్జితకోకా! సుందరకీనిజప్రతీకా! సమంచితబింబోష్ఠికా! బహుసుశ్లోకా! మహిమాస్తోకా! నిరంతరానవరాకా! విగతశోకా! మత్ప్రాణ పరిపాకా! కృపాలోకా! కైకా! నీకేటికీకాక? నాపైఁగోపము లేక యేటికి సౌమ్యభావమున ననుఁజూచి యాజ్ఞాపింపవు-లెమ్ము.

కైక —(లేచి యేడ్చుచు) నాథా! యొంటి యుండియు నేననాథనైయుండఁగలిగె. కడుఁజాలికత్తెనైతి. నాయభీష్టము నెఱవేర్చువారు లేరైరి.

దశ —మనోహారిణీ! నీయభీష్టమైన దేమి? సర్వాభీష్టములు సమకూర్పనేనుండ నీకేటికి కొఱంత?

కైక —నీవనుటయేమి? నీవాడినట్లు జరుపుదువా యను సంశయమును నాకుఁగలిగెడు.

దశ —అయ్యో! ఇట్లేల నన్నలుఁగఁజూచెదు. పొలఁతీ! నిన్ను నన్నులవలఁతియంచు కన్నులఁగప్పికొందునే. నీమాట జవదాఁటుదునే? నీకేటికీసంశయము? నీయభీష్టమెట్టిదైనను, ఎట్టి దుస్సాధ్యమయినను, నాకుశక్యము మాత్రమైనచో నెఱవేర్చెదను. నీయాన, నాయాన, రామునాన, నెఱవేర్తును-ఆనతిమ్ము.

కైక —అట్లయిన రామునిమాని మాభరతునికిఁ బట్టముగట్టుము.

సుమంత —(స్వ) పాడుముండ యిట్లేలడిగెను?

దశ —ఏమీ! ఏమీ! కైకా! నిక్కమాడితివా? నేనేమైనఁ దప్పువింటినా? నామనసు పరీక్షించెదవా?

కైక —త్రికరణశుద్ధిగా నిక్కమాడితిని.

దశ —హా! దైవమా! కైకా! నీకేటికీ కోరిక? రాముఁడు నీకెట్లపకారుఁడు? వాఁడు

శుద్ధిగా నిచ్చెదను. నీవరములలో మించివచ్చినది రామపట్టాభిషేకభంగముగదా? రాము నెట్లయిన వేఁడుకొనఁగలను. ఆ రెండువరములు నిష్ఫలఁజేయుడుగుము. ప్రసం-కృత్యములన్నియు నొక్కసారియే కానిమ్ము.

కైక—మిక్కిలి సంతోషము. అట్లయిన నడిగెదను. ఒకవరమునకు భరతుని పట్టాభిషేక మొనర్పుము. మఱియొక్కటికిఁ బదునాలుగేండ్లారణ్యమునఁ దాపసవృత్తిమై నుండునట్లు క్షేపింపుము రాము.

దశ—హా! శ్రీహరీ! (మూర్ఛిల్లిలేచి) కైకా—కైకా! నాపాడుచెవులకు నేదేమైన భ్రమము గలిగెనా లేక నిక్కముగ నీవు రామునకుఁ బంపుమంటివా?

కైక—బదునాలుగేండ్లు.

దశ—హా! హా! శ్రీహరీ!

కైక—తపసివేషమున

దశ—కైకా! కైకా!

కైక—ఔఁనే.

దశ—అయ్యయో! మారామునిపాలిటిపెడబాయవై, నాపాలిమృత్యుదేవతవై, మాయింటికిఁ గాలసర్పమవైతివిగదే! ఏమిసంతోషమని యీకూర్మి వరమడిగితివే. భరతునకుఁ బట్టము కట్టుదురుగాక, రామునరణ్యమునకుఁ బంపుట యేమికోరికయే. ఎవ్వని సుగుణము నాబాలగోపాలముగ లోకులందఱుఁ బ్రశంసింతురో, యిక్ష్వాకుకులజు లెవ్వరు వడయని సత్కీర్తి యాచిఱుతఁదనమునందె యెవ్వఁడు వడసెనో, పరకాంతలఁ దల్లులుగ బరధనము హాలాహలముగ నెవ్వఁడెంచునో యేవాఁడు తనతల్లికంటె నెక్కువగ సవతితల్లులకు భక్తియొనర్చునో, తనభ్రాతలఁ దనశరీరములోని భాగములుగ నెవ్వాఁడు ప్రతీక్షించునో, యెవ్వని నొక నిమిషము వీక్షింపకున్న నేమనఁజాలనో, యట్టిమహనీయుఁడు, దిగంత విశ్రాంతయశోవిలాసుఁడు, దైతేయ తమఃప్రచండభానుఁడు, పరశురామ గర్వభంగ, కౌశికప్రియశిష్యుఁడు, సీతాప్రాణనాథుఁడు, వానిపై నీకీద్వేషమేల? నీకేమివాఁడు విషముపోసెను? భరతునకు వాఁడేమియుడుగరములు గలిగించె? నాసంతోషమున కగ్నిహోత్రము నిడితివి. హృదయమునఁ గాలకూటము నభివర్ధిల్లఁజేసితివి. నాపాలి కాళరాత్రివై జనించితివి. కటకటా! కైకా! నేబహుదినములు మనువాఁడఁగాను. విధాతృఁడిచ్చిన యాయువు నీవేల తగ్గించెదవు? నేదీనుఁడ-వృద్ధుఁడ-అనన్యగతికుఁడ. నినుశరణొందినవాఁడ. నీచరణములంటి వేఁడెదను గరుణింపుమా. ఈక్రూరవృత్తిమానుమా-నాపైదయరానిమ్మా. (నమస్కరించును.)

కైక — (అవలఁబోయి) రాజేంద్రా! ఈటక్కులేల చేసెదవు? నేనేమడుగ రానిదడిగితి. నీమోసమునకు నేను లోఁబడనని నమ్ముము. (నిష్క్రమించును).

దశ — హా! దైవమా! నాకేమిప్రాప్తిదెచ్చితివి.

## అనుబంధము 12

ఇన్ని దినములు మని తుదకీదిక్కులేనిభంగి కలుగునే! అక్కటా! దీనినేల నేను చేపట్టితిని. అయ్యయ్యో! నాముద్దులపట్టిని-నామోహపుతనయు నేరణ్యములకుఁ బంపి యెట్లుప్రాణముల ధరింతును. కటకటా! ఈమాంకి నేనేల వరములిచ్చెద నంటిని? సత్యప్రతిజ్ఞఁబాయుదునా? లేక దుర్మరణమున కియ్యకొందునా? ఎట్టిదుర్మరణము గల్గినను నానోటివెంట నాత్రిలోకసుందరు నరణ్యముల కెట్లు పొమ్మందును? కామాతురుఁడనియుఁ గఠినహృదయుఁడనియు, నన్నెల్లరు దుష్కకరిగొనితిట్టరొకో! కౌసల్యయేతెంచి రాముపట్టాభిషేక మేలమానితివన్న నేనేమి వచింపవలెను? అయ్యో! పట్టాభిషేకము మాత్రము మానుటకాదే. ఘోరాటవులకుఁ బంపుటయే మాఱువరమే. ఈదుఃఖసాగర మేగతిఁదరియింతును? ఆరాముఁడు-అఖిలజనమనోరాముఁడు-రిపుభీముఁడు కరుణాధాముఁడు వచ్చి ననుమాటలాడించిన వానికి నేముఖము నెట్లుచూపుదును? రామచంద్రా! సద్గుణసాంద్రా! నీబుద్ధి నాకింతయేసుమా. అకటా! ఎట్టిదుష్టకర్మునకు నీవు కొడుకవై జన్మించితివి ఎట్టిపాతకునకు నీసుతత్వము సమకూరె. ఎట్టినిర్భాగ్యుని, నెట్టిపాపుని, నెట్టిపగదాయ నెట్టిద్రోహిని, నీవు తండ్రియంచు నమ్మితివి! నీముద్దుమోమింకెట్లుచూచెద? దైవమా! మారామునకు జనకాజ్ఞఁ దిరస్కరించు బుద్ధియైనఁ గలిగింపుమా. అట్టిసంతతమైన నాకుసమకూర్పుము. అట్లయిన నిశ్చింతముగ మనఁగలఁగదా? ఆరాముఁడట్టివాఁడుకాఁడే. నేనేమిచేయుదను? దైవతోత్తములారా! ఇప్పుడే నాప్రాణములఁబాపరాదా? ఘోరభూకంపమిప్పుడే యుద్భవించి యీయయోధ్యనంతయును మ్రింగరాదా? కాలవ్యాళములారా! ఈదుష్టకర్ముని మీవిషానలముల దహింపరాదా? సౌధమా! ఇప్పుడువిఱిగి నాపైఁబడరాదా? చిత్రరూపముననున్న పితృపక్షీ! నీవిప్పుడు సజీవుఁడవై నన్నుఁగొనిపోరాదా? అయ్యో! ఈప్రొద్దేటికిఁ బొడుచుచున్నది. జీవరాశి నిద్దురలేపి వారిహృదయము లలరింపఁగల కమలబాంధవుఁడు నాపాలి తపనుఁడైయున్నాఁడు. ఈప్రొద్దయినఁ బొడువక జగమంతయు నిట్లె రాత్రి మయముగానుండి యంతరించిపోయిన నాకెంత సంతోషముగానుండును? ప్రభాకరా! నీవుమావంశకర్తవు గావా! నీకేల గరుణగలుగదు? అనుగ్రహించి యుదయింపకుండుమా. అక్కటా! అప్పుడే తొలిదెస యుదయదరుణకిరణ ప్రసంగమసాంధ్యరాగముల ధరయించె. ఈసూర్యుఁడు తానేల యుదయింపకుండును. ఇంతైన నాపై నక్కటికము చూపఁడుగా

ఘోరకరుఁడనుట విదితమాయెను. ఇప్పుడే నానారాచమున వీనిరూపుమాపెద. (ధనువెత్తి) ఆహా! నాకేమి బుద్ధిమాంద్యము! నావిధిపై కోపమీభాప్యంతునిపైఁజూప నేమిటికెక్కును? దశరథా! దశరథా! నీవీసూర్యుని మఱియొకనాడు చూడఁగలవా? ఇంకెక్కడి సూర్యుడు. ఎక్కడి దశరథుఁడు! హా! రామా! నిన్నుజూచిన వెంటనే నీతో నీకైకపరము చెప్పినవెంటనే దశరథుఁడు పొలియఁడా?

[ప్ర: సుమంత్రుఁడు]

సుమం—(దశరథుని సమీపించి) రాజన్యా! నరపాలకంఠీరవా! లెమ్ము లెమ్ము. ఇది తెల్లవారెను. మంగళస్నానము వేళయాయె. అభిషేకమండపమున శ్రీరాముఁడు సుస్నాతుఁడై లక్ష్మణులోడ సుఖాసీనుఁడై యున్నవాఁడు. వసిష్ఠాదిసంయమీంద్రులు కర్తవ్యక్రియాకలాపముల నిర్వహించుచున్నారు. మీరాకం బ్రతీక్షించుచున్నారు. లగ్నమాసన్నమాయె. ధరాధిపచూడామణీ! పరాకు! ముఖ్యభృత్యుఁడు సుమంత్రుఁడు విన్నవించుచున్నాఁడు

దశ—(లేచి కన్నీరునుంచి) హా! రామా! హా! దైవమా! (నేల.బడును).

సుమం—హా! హా! ఏమిది?

[పునః ప్ర: కైక.]

కైక—సుమంత్రా! రామునిందు తోడితెమ్ము. పొమ్ము.

సుమంత్రు—

కం॥ మాతా యిదియేమిటికీ
భూతల నాథునకు వింత పొగులు గలిగెనిం
దేలయు నరయ నాకీ
యాతత శోకంబుగతము నానతియిమ్మా॥

అమ్మా! కైకేయీదేవీ! ఇదియేమి రాజన్యుఁడు—

కైక—మాటలఁగాలహరణమేల? రాము డేతెంచిన నన్నియు విశదమగును. వైళమ పొమ్ము.

సుమం— (నిష్క్రమించును.)

దశ—కైకా! నాపైనింతరౌను నీకుఁగరుణకలుగదా? నేనేమపరాధమొనర్చితి? నా యెడ నీకున్నదని యనుచున్న మోహమున కిదియాతారాత్రాణము? రామునేల పిలిపించితివి? వానితో నేనెట్లు మాటాడుదు? దేవీ! నీవుకాపున్న నన్నెవ్వరు రక్షిం

చువారు? నాయపరాధము లెన్ని యున్నను గారుణ్యభావమున క్షమింపుము. కాకున్న నీయాన నేనసువుల భరింపఁజాల. ఈవృద్ధునిపైఁ గార్పణ్యము మానుము. ననురక్షింపకున్న విడువను. అభయమీకున్న నూనను. (అని కాళ్లంటఁబోవ),

## అనుబంధము 13

కైక—(విదలించి) రాజేంద్రా! ఈవాగత్యమేల? వరములీ లేదనుము. ఈయూరడి యేల? నాసవతి కౌసల్యకు భీతిల్లి నాకుమ్రొక్కెదవా? ఇంకఁజాలుపొమ్ము—

[ప్ర: రాముఁడు-లక్ష్మణుఁడు-సుమంత్రుఁడు (ప్రక్కన).]

రాము—సుమంత్రా! ఎందున్నాఁడు మాయయ్య? ఎందున్నాఁడు?

సుమం—దేవా! ఆభవనముననున్నారు.

రాము—అయినఁ బోవుదము.

దశ—కైకా! ఇదె రాముఁడు వచ్చినజాడ తోఁచుచున్నది. ఇఁక నేమనఁజాలను. ఇమ్మాత్ర నాకభయము? (కాళ్లంటును).

కైక—ఈవగలికిఁ జాలునూరకుండుము.

దశ—ఎంతటి కఠినాత్మురాలవే! ఎంతటి కిరాతకివే. అయ్యో! (మూర్ఛఁగిడును).

రాము—(దశరథునొద్దకువచ్చి) అయ్యా! అయ్యా! సుమంత్రుని యెదుట నీవుకన్నీరు నించితివఁట! నీకెట్టిదుఃఖము గలిగె? నేఁడేల నను జూడకున్నావు? మూర్ఛనైన దీయవు. నీమోముదమ్మిఁ జూడఁగూడని యంతపరాధము నేనేమిచేసితిని? ఎప్పుడు నను వీక్షించినను గౌఁగిలించుట మానవే. ఇప్పుడు నేవచ్చి యింత సేపయినను జూడ వేల? నీపెదవినుండి మాటవెడలినంతనే యెట్టికార్యమునైన నొనర్పఁగలకొడుకులుండ నీకేల యీదుఃఖము. అయ్యో! నీమునుఁగున నీవక్షోభాగ మెగిరిపడుచు నీకుఁగల యపారదుఃఖము నెఱింగించుచున్నదే. నిన్నసాయంతనమున ననుఁబట్టాభిషిక్తుఁ జేసెదనని మహానందమున మాటలాడితివే? ఒక్కరాత్రిలో నాయానంద మెందుఁ బోయెను? ఏభూసురుల నీవెట్టిగాసి వెట్టితివి? ఎట్టి శరణాగతుల శత్రువులకప్పగించితివి? ఎట్టిసత్యముల జరుపలేకపోయితివి? ఎట్టి పరధనములఁ బరస్త్రీల నీవు కాంక్షించితివి? నీయేకుమారున కెట్టియాపదగలిగె? అయ్యో! ఆగిరివ్రజపురమునుండి యేమైన వృత్తాంతము తెలిసెనా? భరత శత్రుఘ్నులు క్షేమముగనున్నారా? అయ్యో! నీవు మాఱుమాటపల్కకున్న నాప్రాణములు నిలువఁజాలవు. ఒక్క మాటాడి నాయనుతాపముఁ దీర్పరాదా?

## అనుబంధము 14

(పైఁబడియేడ్చును).

దశ—(మనసుఁగుదియకయే రాముఁగౌఁగిలించి) రామా! రామా! (ఏడ్చును).

రాము—మాతా! కైకేయిదేవీ! ఇదేల మాయయ్య యిట్లు దుఃఖించుచున్నాఁడు? నేను దెలియక నాజనకునకింత పాటుగలుగునా? ఏల యూరకున్నావు? ఎట్టి వార్తకాని కొంకక వచింపుము.

కైక—కుమారా! దేవాసురుల యుద్ధమునాఁడు మీతండ్రి నాకు రెండువరముల నిచ్చి యుండెను. వాని నిప్పుడడిగితి. భరతునికిఁ బట్టముగట్టుటొకటికిఁ, దాపసవృత్తిపై, నేఁడే నిన్ను బదునాలుగేండ్లరణ్యమునకుఁ బంపుటొక్కటికి వేఁడితి. ఇచ్చెను. ఆమాట నీకుఁ జెప్పుటకు వాయాడి శోకించుచున్నాఁడు.

దశ—హా! రామా! హా! రామా!

లక్ష్మ—కైకేయిదేవీ! ఇట్టిఘోరవరములా—.

రాము—లక్ష్మణా! ఊరకుండుము. జనకా! ఇంతకార్యమునకింత యోచింపవలయునా? నీవు శోకించుటకైన దీని నేమున్నది? పదునాల్గేండ్లు నన్నరణ్యమున నుండనియమించుటయా శోకకారణము? భూప్రదక్షిణాభిలాషము నాకుమిక్కుటముగ నున్నదని యెన్నిమారులో విన్నవించితినే? పట్టాభిషేకమున కియ్యకొనునప్పుడును నీయానతి మీఱరామిచే సమ్మతించితిఁగాక, నాకు దేశదర్శనాభిలాషమే మెండుగ నుండెను. నేఁబ్రార్థించినను నీవనుగ్రహింపకుండినయర్థ మీదేవి నాకిప్పించి స్తోత్రపాత్రయయ్యె. కావున దీనికై శోకింప నేటికి? ఇంక భరతునిపట్టాభిషేకమునకు శోకింతువా? నాసోదరుఁడే? నాపైఁగూర్మిగలవాఁడే! నీకొడుకులలో నెక్కుడగు భక్తిగలవాఁడే. అట్టివాఁడు రాజ్యమేలుట నీకును నాకును సంతోషకరముగా నుండవలయుఁగదా? నీవు నాకభిషేకము చేసి యుండినను, మాభరతు రాజ్యమున నిల్పి నేదేశదిదృక్షచే వెడలవలయుననియే యుంటి. మున్ముందే యీమాటచెప్పికొన్న నీవు సమ్మతింపవో యనుభయమున నీకుఁజెప్పనుంటి. ఈతల్లి వరముల వ్యాజమున నాయభీష్టము నెఱవేర్చి పరమసమ్మోదమావహింపఁజేసెఁగా! ఇదియింతయొప్పునే! ఇవియన్నియున్నట్లుండ వరమునిచ్చినవాఁడు తండ్రియఁట. వేఁడినది ప్రేమగల తల్లియఁట. రాజ్యమేలువాఁడు విశ్వాసపాత్రుఁడగు తమ్ముఁడఁట. ఇందున నేది మీకుఁ దగినది? జనకా! ఇంచుకయు యోచింపకుము. ఈపదునాల్గు సంవత్సరములును బదునాల్గు దినములుగాఁ గడపనఁగలవు. నేనవశ్యము పితృవాక్యమును జరిపెద. ఒండనకుము. ఇదేపోయి మిగిలినతల్లులతోడ నీసంతోషవార్తచెప్పి వచ్చెద.

## అనుబంధము 1౫

నాకొసఁగుము. (పోవుచుండ)

దశ—(లేచి) రామా!—శ్రీరామా!—నిన్ను మాన—

రాము—(మరలివచ్చి) జనకా! శోకింపకుము. ఇదియేలాగో యిట్లు శోకించెదవు ?

రాము— }
లక్ష్మ— } (నిష్క్రమింతురు.

దశ—రామా! రామా!

లక్ష్మ—(ప్రక్కన) జనకుఁడు మరలఁ బిలుచుచున్నాఁడు.

రాము—ఊరక కలువరించుచున్నాఁడు. మరలవత్తుముగదా? పోదము—

(నిష్క్రమింతురు)

దశ—(గట్టిగా) రామా! రామా! రామా!

(ముందు యవనికపడును)

—* ప్రథమాఙ్కము సమాప్తము *—



శ్రీ

# పాదుకాపట్టాభిషేకము.

## ద్వితీయాఙ్కము-ప్రథమరంగము.

### కౌసల్యయిల్లు.

[ప్ర: కౌసల్య (మంగళద్రవ్యములిడుకొనియుండి క్రిందఁబడియుండును) రాముఁడు లక్ష్మణుఁడు శిశిరోపచారములు చేయుచుందురు]

కౌసల్య—(లేచి) తనయా! నేఁడుదయమున లేచి యేనెట్టిపాపిముఖముఁ జూచితి? నిర్ఘాతపాతముఁబోలిన యీపెట్టిదపు వార్తవింటిని.

**అనుబంధము 16**

నాహృదయము వెట్టివజ్రకఠినమో! యీవార్తవినియు వ్రయ్యలుగాకున్నదే! అయ్యో నీపట్టాభిషేకమునకని యీమంగళద్రవ్యముల సేకరించియున్నానే! హా! కైకా! ఇన్నిదినములనుండి యంతప్రీతిపాత్రవుగానుండి తుదకు సపతిమత్సరము సాధించితివే! తనయా! తనకొడుకు రాజ్యమేలిన నేలుఁగాక, నిన్నేల యడవులకుఁ బొమ్మనవలయు. ఇంతటిపగ యెందైనవింటిమే! ఈమాటకైక నీతో నెట్లాడఁ జాలెను? ఆపతి యిందులకెట్లు సమ్మతించెను? తనకుఁగూరిమిగల కొంతెకు వరము లిచ్చిన రాజ్యమంతయు దనప్రాణమైనను నరకుసేయక యీవచ్చుఁగాక పెద్దవాని కొడుకుల నరణ్యములఁద్రోయ టొప్పునే? తనయా! నినుఁబాసియేనెట్లునిర్వహింతును? నన్నెవరాదరించువారు? అయ్యో! కొడుకరణ్యములకేగెడు. పతినిఁ గైక కొనియున్నది. ఇంకెట్లుభరింతు? తనయా! జనకుఁడు పొమ్మనంతనే యేయుపరోధము లేక నీవరణ్యములకేల యేగవలయు?. రాజ్యమాశింపకుము. భరతునెగ్గులాడకుము. అయినన్ నరణ్యములమాని నాయొద్దనుండుమా. జనకాజ్ఞపాలింపఁదగినదయైన జనని యాజ్ఞపాలింపదగనిదియా? నీవు ననుఁబాసిన నాప్రాణములు నిలువవనుట నీవెఱుఁగవా? మాతృవధకైన నియ్యకొలుగావించు పితృాజ్ఞయుంగలదా? కుమారా! నీవాకైకగర్భమున జనింపక నానిర్భాగ్యగర్భమున నేల జనించితివి?

**అనుబంధము 17**

లోకసంరక్షణశాలి యగుకొడుకు, నాకుండియు గొడ్రాలుకంటె నికృష్టమగు దశ నాకు బ్రాప్తించెఁగా! తనుజా! నీపాదరేఖలాదిగాఁ జూచిన సాముద్రికులు నీవు ధరణీభరణదక్షుండ వగుదువనిరి. వసిష్ఠాది సంయమీంద్రులు నినుఁ జక్రవర్తిపదస్థుఁడవుగమ్మని దీవనలిచ్చిరి. ఆశాస్త్రిముల నాదీవెనల నీకైకయొక్క మాటమాత్రమున నబద్ధములఁ జేయఁజాలెఁగా? నీవు జనించినదాదిగా నినొక్కనాఁడుఁ బాసి యెఱుఁగనే! ఈవియోగసాగర మేగతిఁ దరింతు? పదునేఁడేండ్లు నినుఁ బెంచినది యిట్లవుటకా? పెంచిన ముద్దుచిలుకను బోవురుగాని కప్పగించినట్లాయెఁగా? అయ్యయో! నీవు నాకుఁగలుగుటకెన్ని దైవములఁ బూజించితిని! ఎన్ని వ్రతములఁ నాచరించితి! ఎన్ని యుపవాసములఁ జేసితి. ఇట్లుపాటుపడి కులాభరణమైన నిన్నుఁ గనినది యీకైక కొప్పఁజెప్పుటకా? అనుకంపలేక నన్నుఁ బాసిపోవ నీమనసెట్లొప్పును? తనయా! రామా! వలవకుడుగుమా యీ యాచరణము.

రాము — జననీ! నీవిట్లాడకుము. జనకాజ్ఞకై కదా పరశురాముఁడు తల్లినైనఁ జంపినది? నాకు జనకాజ్ఞయెట్లో నీకును బతియాజ్ఞయట్లేగదా? యోచికపకు అడిల్లుము.

సీ॥ తల్లి యెన్నఁడుగాని తప్పఁగూడదనుభంగి
వెలసెడుపతియాజ్ఞఁ దలఁప వలదె
యిన్నాళ్లకీర్తికై మన్నతండ్రికసత్య
కలుష మబ్బెడుభంగిఁ దలఁప వలదె
కలనైనఁ బితృవాక్యమొలమి మీఱఁగలేని
తనయుపుత్రత యింత తలఁపవలదె
ఎట్టికష్టములైన నెలమిఁ గొన్నాళ్లలోఁ
దొలఁగఁబారుటయింత తలఁపవలదె

తే॥ గీ॥ వసికిఁ జనఁగలోకంబేమి మునిఁగెనమ్మ
కడచుఁ బదునాలుగేండ్లెంత కాలమమ్మ
వనటఁ గుందంగ నంతేమి వచ్చెనమ్మ
కడఁగి మాయమ్మ శోకంబు విడఁగదమ్మ॥

నేనొక్కఁడఁగదా కొన్నిదినములు లేకుండునది? ఇందులకింతయేటికి? భరతుఁడు నాకంటె నీయెడ భక్తిపరుఁడు. ఈలక్ష్మణుఁడు, శత్రుఘ్నుఁడు నట్టివారే. వీరుండ నీకేమికొఱత? నీవు దుఃఖించి యేమిప్రయోజనము? నాకాజ్ఞ నిర్వహింపకున్నఁ దప్పదు.

కౌస — రామా! అయిన నీవు పోవ నేవలయునా? నాయాజ్ఞ నిర్వహింపవా?

రాము — తల్లీ! నన్నేల సంకటమునకు గురిచేసెదు? పితృాజ్ఞయనుల్లంఘ్యంబు. నను పనిపింపుము. సుమిత్రాదేవియొద్దకును సీతయొద్దకును బోవలయు. మరల నీయొద్ద కేతెంచి నీతో మాటలాడఁగలను.

కౌసల్య —

ఉ॥ అన్వయలీల నీకు వసుధాధిప పట్టముఁ గట్ట రాజరా
ట్స్వవ్యుఁడవై వెలుంగ నభిషేకము వేళను నీకొసంగఁగా
భవ్యముగాఁగఁ గూర్చితి నపారముదంబున నింక మంగళ
ద్రవ్యము లేమి సేయుదు విధాత్రన కింత చలంబు గల్గెనే॥

అయ్యో? ఈమంగళద్రవ్యములుగలవే వీని నేమి చేయుదు.

రాము —

చ॥ అడలకుమమ్మ మీఱఁదగమ్మ ధరావరుఁ గల్ల సేయుటె
న్నఁడువలదమ్మ యీపదియునాలుగువర్షము లింతలోన నే
కడచనునమ్మ నామనవిఁ గైకొనుమమ్మ యులంతనాకు ని
మ్మడియగునమ్మ పీఁకినమస్కృతు లేనొనరింతు నమ్మరో॥

(ద్రవ్యములకుఁ బ్రదక్షిణ నమస్కృతి సేయును).

కౌసల్య — హా! శ్రీహరీ! (మూర్ఛిల్లును).

(యవనిక పడును).

—⁂—

## ద్వితీయాఙ్కము-ద్వితీయరంగము.

### సీతనగరు.

[ప్ర: రాముఁడు-సీత]

### అనుబంధము 18

సీత — నాథా! ఇట్టికూరభంగి నీకుండుట యొకనాఁడు నెఱుఁగఁగదా? నీకరణ్యవాసము జేయుచుండుటకే నోర్చితి. భరతునికిఁ బట్టాభిషేకమగుటకు మొదలే యోర్చితి. అరణ్యవాసమున కింతయైనఁ జింతింపను. సకలసంపదలు వాయుటకోడను. కాని నిన్నుఁ బాసియుండుట కేనోపసుమా? నాయాన నీపాదములాన నేనిండుండఁజాల. పరీక్షించుట కిట్లాడెదవుగాక నిక్కమని నేనమ్మను. నీవడవులకుఁబోవ నీదండనున్న నాకెందును గొఱవడదు. నన్నడవిపాలు చేయుటకే సహింపను. నీచరణములంటి వేఁడెద. వలవదుడుగుమా యీభయంకరకృత్యము? నన్నుమానుటయా? నే నేమపరాధ మొనర్చితి. నాపాడుచెవులెట్టి మాటలవినెను? మనోనాథా! నీవభయమీకున్నఁ ప్రాణముల భరింపఁజాల.

రాము — కాంతామణీ! ఆయరణ్యముల నీవు నాతో నెట్లుండఁగలవు? ఉద్యానవనముల సంచరించునపుడు కోమలలతలఁ ద్రొక్కిన నీకాళ్లు నొచ్చుచుండునే. ఆతానేల కాలెట్లూనఁగలవు? వీణాస్వనమే యొక్కొకసారి కటువుగాఁదోఁచెడు నీకు కానవ్యాఘ్రారావమెట్లు సహ్యమగు? చిత్రప్రతిమలలోని సింగముల రాక్షసులఁ జూచి భీతిల్లునీవు ప్రత్యక్ష హర్యక్షముల రాక్షసులఁ జూచి యెట్లోర్వఁగలవు? నీవు నాతోడనుండుట నీకు సౌఖ్యమా? నాకు సౌఖ్యమా? వలవదుడుగుము నామాటవినుము.

### అనుబంధము 19

సీత — ప్రాణేశా! పతిమాటవినకుండుట సతికిఁ బాపమగుట నేనెఱుఁగనిదానఁగాను. ఐన నిట్టిమాటలు వినకున్నను దోషముగలుగదు.

కం॥ మృతిబొందఁ గోరెనేనియుఁ
బతిమాట వినంగవలయు పాడి యెఱుఁగుదుఁ గాఁ
బతి తన్నుఁ బాయనెంచిన
సతి వలదనుమాట కలుషసహితం బగునే॥

నీవిందు లేకుండిన నిదియే నాకరణ్యమగు. ఈహంసతూలికాతల్పమే శిలామయ తల్పమగు. ఈసౌధాంతరమే పర్ణకుటీరముకంటె నికృష్టమగు. ఈపన్నీటివాకలే నదీనదములగు. నాచెలికత్తియలే రాక్షసులగుదురు. అయ్యో! ఈయరణ్యవాసము నాకేల కల్గెదవు? ఇటుమానిపోవుటకా మాజనకుఁడు నను నీకిచ్చినది? ఇట్టిదుస్తర వియోగము ఘటించుటకా యగ్నిసాక్షిగ నన్నుద్వాహమైనది? భూరమణా! అడవులలో నీవలయు నెడ నీకుపచర్య సేయ నేనువలదా? కైకేయి యేమయిన నన్నుఁ బోవలదనెనా? అట్లయిన నామె పాదములపైఁబడి వేఁడికొందును. ఆమెకు నీయట్టి నిష్కరుణకలదేమో చూచెద. ఓప-రోవ. నినుఁబాసి నేనెందుమననోప. నీచరణములాన నేమాననోప. రక్షింపుము. రక్షింపుము.

## అనుబంధము 20

(కాళ్లపైఁబడును)

రాము —హా! దుఃఖము-కామినీ! లెమ్ము. లెమ్ము. ఏలయింతఁజెందెదవు? అడవుల నీవిడుమలఁ బడలేవనిపల్కితిఁగాక నిన్నుమానిపోవ నాకుఁగోరికయా? నీసరసనున్న యరణ్యమే నాకు స్వర్గము. పర్ణశాలయే నాకింద్రభవనము. కందమూలములే భక్ష్యభోజ్యములు. ఊరడిల్లుము.

[ప్రవేశము: లక్ష్మణుఁడు-(దూరమున)]

లక్ష్మ — (దూరము పోవును).

రాము —లక్ష్మణా! రమ్ము. ఈసీత నావెంటవచ్చెదనని కడునిక్కచ్చి యొనర్చె. సంతాపముఁజూడఁ జాలకయ్యకొంటిని.

లక్ష్మ —ఊఁ—

రాము —ఏమూరక "ఊఁ"—అంటివి? లక్ష్మణా! నీచందము నేఁడు చిత్రముగా నున్నది. మనసార నొకమాటయిన నాడవు. ఇక్కడికేలవచ్చితి?

లక్ష్మ —రమ్మనియన్న వచ్చితి.

రాము — నేను నిను రమ్మంటినా?

లక్ష్మ —రమ్మనకున్న నూరకయే వచ్చితి.

రాము—నీజాడలు నాకేమియుఁ దెలియవు. ఎట్లును వచ్చియున్నావు. దశరథునొద్దకు బోవుదము రమ్ము.

లక్ష్మ —ఊఁ — (నిష్క్రమింతురు)

## ద్వితీయాఙ్కము-తృతీయరంగము.

---

### కైకయిల్లు.

[ప్రవేశము: మంథర]

మంథ—ఇప్పుడు కొంచెము నెమ్మది గలిగియున్నది. ఇంకఁ దిరుగుటకు దారిలేదు. ఈ ప్రభావమూరంతయు నప్పుడే తెలిసినది. ఊరిముండలందఱు నప్పుడే యేడ్చుచున్నారు. ఏడ్వనీ! ఇంకను నేడ్వనీ! రాముఁడరణ్యమునకుఁ బోయిన నీవిధవలకంతయు నేమి పోయెనో. అక్కడ నెవ్వతెయో కండ్ల నీళ్లొరుగ నేడ్చుచుఁబోవుచున్నది. ఆహా! నన్నుఁజూచి యానైపున మోముఁద్రిప్పి పోవుచున్నది. (నవ్వును) తిరిగియేమాయెను. దీనికేమి విషము పోసినాను.

[ప్రవేశము: -కైక.]

కైకా! ఎట్లు?—

కైక—మంథరా? ఎంతకార్యమాయెనే! ఏమి యుత్పాతముగలిగెనే! నాపతిస తాపము చెప్పఁజాలను. ఇంతగునని యెఱుఁగ.

మంథ—అయిన దయినది. ఇప్పుడు చింతించి ప్రయోజనమేమి?

కైక—

అనుబంధము 21

ఆసంతాపమున నానాథుఁడు జీవింపఁగలఁడా యని సంశయము పుట్టుచున్నది.

మంథ—పీడవీడినది.

కైక—దుర్జాతివిధవా! ఇంతచేసి యిట్లాడెదవా?

మంథ—నీవు కానున్నానంటివి. నన్నేల విధవాయనెదు.

కైక—అయ్యో! ఏమిప్రాప్తివచ్చుకొంటిని. దైవమా! ఇప్పుడేమిచేయుదును.

మంథ—సులభముగనే యున్నదే చేయఁదగినపని. తపస్వినర్పించినని దశరథుఁ క్షమింపవేఁడుము. పిదపఁ గౌసల్యకాళ్లఁబడుము. రామునిపట్టాభిషేకము చేయింపుము.

కైక—చేయుదునా యట్లు?

మంథ—పిదపఁ జేయఁదగినది వినలేదే.

కైక—అదియేమి?

మంథ—తర్వాత భరతునిఁగొనిపోయి యొకకూపమున నూకి నీవును నొకగుండుకట్టుకొని దుమికి చావుము. విధవాత్వము తప్పవలయునన్న వేఱుమార్గములేదు

కైక — నా నాథుఁడు క్షమించిన పిదప నేనేల చావవలయు ?

మంథ — నేను నీకుహితము చెప్పుదాననా ? నా మాటలు నీవు విందువా ? నన్నే లపేగెను పొమ్ము. నాకింతకంటె నుపయోగమైన పనిగలదు. నిన్నుమాని తనను దాసినైన బహుమాన మిచ్చెదనని కౌసల్య చెప్పిపంపినది. బ్రదుకు తెఱవుచూచి కొందును.

కైక — మంథరా ! దశరథుఁడు క్షమించిన నాకేల క్షేమకరముగాదు ?

మంథ — భరతుఁడు నీకుఁ గలిగినట్లు లేదు. వాఁడు నీకుఁ సవతికొడుకు. వానిపాలి పగదాయనైతివి. క్షమింపవేఁడిన దశరథుఁడు నిన్నేల క్షమింపఁడు ? అతఁడేమి సామాన్యుఁడా ? మొదట వరముల నడుగక యూరక భరతునికి బట్టము వేడితివే. అప్పుడివ్వనన్నఁ గోపమున దుమికెదనని పోయితివే. అప్పుడేమైన వలదనెనా ? అవశ్యము పడుమనెను. తర్వాత వరములడిగి నిర్బంధించినప్పుడుగదా నీకాళ్లు పట్టుకొన సాగెను. అబ్బినసిగ అబ్బకున్నఁ గాళ్ళుగదా నీమగనికి ? ఇట్టివాఁడిప్పుడేక వేళఁ దనకార్యసాధనమునకు నిన్ను క్షమించినను దరువాత నిను మాటలాడించునా ! కన్నెత్తియైనఁ జూచునా. "ఇది కాలసర్పము. దీనియొద్దఁ జేరిన వినాశమగు" నని యెంచి నీయొద్దకైన వచ్చునా ? ఊరివారందఱు "ఎట్టిపలుగాకి యీకైక" యని తిట్టుట మానుదురా ? నీవప్పుడు గాడిదపై నెక్కి నీపుట్టినింటి కేగవలసివచ్చుఁగదా ? అప్పుడు బ్రదికినమగఁడుగల విధవ వయ్యెదవే. ఇంకేమయినను నీ మగని వరము లడుగఁ గలవా ? ఉన్న రెండువరములు పరిసమాప్తిఁ జెందె. ఇంకేమోమున నడుగఁ గలవు ? ముఖ్యముగ కౌసల్యయే యదృష్టముగలది. "భోగిని యగుభార్యయడిగిన వరము లిచ్చినపతి పట్టపుదేవి నేనడిగిన నెట్లిచ్చుఁడో యెల్లు నిన్న దవికిఁ బంపునో చూతము" అని యింతకుముందుఁ గౌసల్య రామునితో ననెనఁట. దాని యభీష్టము నీవలననే నెఱవేఱఁగలదు. పట్టినపట్టు సాధింపవలెనన్నఁ గౌసల్యను జెప్పి యితరులఁ జెప్పవలయు. దాని చరణములపైఁబడుము. నీకంత వఱకు బుద్ధిగలుగదు. పతియఁట ! చచ్చునఁట ! ఏమయినదే నీపతికిప్పుడు ? అరణ్యములకుఁ బోవురాముఁడు మరలరాక యట్లేపాఱయి పోవునా ? చత్తునని నీపతి చెప్పుకొనెఁ గాఁబోలు. దాని నీవు విశ్వసించితివి కాఁబోలు. మాటలలోనే ప్రాణముఁ బోఁగొట్టుకొనువాఁడు గూబవలె నిన్నిదినములు బ్రతికియుండునా ? మోసకారి పతి మాటలకింత గోలవకుము గనుకనే కౌసల్య నిన్నిట్లు చెవులుపట్టి యాడించునది. విశ్వామిత్రునివెంట రాముని బంపునప్పుడు సైతము నీపతి ప్రాణముల విడుతునని యిట్లే నాగత్యము చేయలేదా ? విశ్వామిత్రుఁడు విడిచెనా ? నీపతి గ్రుడ్డుపెట్టెనా ? ఇఁక నీతో మాటలాడుటకుఁ గాదు. నానోరు నొచ్చుచున్నది.

కైక—మంధరా! నిమాట నిక్కము. ఇప్పుడు వెదదీసిన సపత్నిగర్వ మొక్కటే యేనిలుచు. నీవలె హితముచెప్పువారు నాకులేరు. నీయుపకారమున కేమొసంగుదును? కొమ్ము. చంద్రహారము (ఇచ్చును.)

మంధ—(పారవేసి) నన్నుఁ దిట్టుటకిదియా యుక్తి? కూలికి నీకు హితోపదేశము చేసితి ననుకొంటివా? రేపు నీకొడుకును "చక్రవర్తీ" యనిపిలువ నీవు చక్రవర్తి మాతవై నన్నాదరించిన నా సంతోషమే చాలునాకు బహుమతి.

కైక—(మంధర నాలింగనముచేసి) మంధరా! నీవు నాయెడ నవ్యాజకరుణగదా? అదియేమే మంధరా! వీధిని గలకలము?

మంధ—చూడుమదె కౌసల్య వచ్చుచున్నది. జనులందఱు దాని దుఃఖమును దమ దుఃఖముగా భావించియున్నారు. అందులకే యీయులబలము.

కైక—ఇదేమే కౌసల్య పాదచారిణియై పల్లకిలేక వచ్చుచున్నది?

మంధ—ఇంతటితోఁ దీఱెనా? నీచరణదాసి కాఁజాలదా? ఒక్కమాట. ఇది గయ్యాళి. టక్కులాఁడి. దీనిమాయలకు మోసపోవకుము. నీవిందుండకుము పొమ్ము.

కైక— (నిష్క్రమించును)

[ప్రవేశము: కౌసల్య]

కౌసల్య—మంధరా! రాజన్యుఁడును కైకేయియు నున్నారా?

మంధ—(ఏడ్చుచు) అమ్మా! యేలపోయెదవు? ఈ దుర్జాతి కైక విడువని పట్టుపట్టి రాజేంద్రుని బాధింప సత్యవ్రతుండైన ధరణీశుడేమి చేయఁగలడు? ఇదియెంతటిదో పలుగాకి! దీనియొద్ద నేనుండను. దీనికొడుకే యీ పాదురాజ్యమేలని. నీపాదములు శరణొందెదను. మనము సరణ్యమునకుఁ బోదము రామువెంట. (కాళ్లపైఁబడును).

కౌసల్య—(కన్నీరునించి లేవనెత్తి) మంధరా! నీ యుపదేశమైనఁ గైక వినదాయఁగా! నీవేమి చేయుదువు? ఎందున్నాఁడో రాజన్యుఁడు?

మంధ—అగ్నిహోమున నున్నాఁడు. అయ్యో! భరతుడెట్టి కులటాసుతుఁడాయె!

కౌసల్య—భరతు నేల యాడ్లాడెదు? వాఁడు నిరపరాధి? (పోవును.)

మంధ—(నవ్వి) పొమ్ము. నీవు శోకకర్మ కాఁగలవు. (ప్రక్కకుఁబోవును.)

(వెనుక యవనికనెత్తిన దశరథుఁడుపడియుండును)

కౌసల్య— (దశరథునిపైఁబడి)

## అనుబంధము 22

[ప్రవేశము-సుమిత్ర].

కౌసల్య — నాథా! ఇదేమిట్లు మీరామునిఁ గానఁ బట్టించితివి?

సుమిత్ర — హా! నాథా! నేఁడేమిదుర్దినము! పట్టాభిషేకమహోత్సవము దుర్దశ్రస్థితికిఁ బరిణమించెనే!

కౌసల్య — నాథా! ఏమి మాట్లాడుచున్నావు? ఇట్టివియు వరములగునా? యుక్తాయుక్తములు పరిశీలింపవలదా? అయ్యో! రాముఁడే. నీమోహపుకొమరుఁడే. అట్టివాని నటవీస్థలికంప నీమనసెట్లొగ్గెను? ఈసంతాపము నీవైన భరింపఁగలవా? నేనేమి తప్పొనర్చితి? కైక నీను మెచ్చులాఁడియైన భరతుఁ బట్టము గట్టుము. కాదనను. నాకొడుకును మాత్రము నాయొద్దనిలుపుమా. నాకుఁబుత్రభిక్షమిమ్మా. నీకు పెక్కురు కొడుకులున్నారు. నాకొక్కఁడేకదా?

సుమిత్ర — నాథా! రాముఁడేల యరణ్యములకుఁ బంప? ఈదుఃఖము మనమెవ్వరమైనను సహింపగలమా? అయ్యో!

దశ — (లేచియేడ్చి) కౌసల్యా! సుమిత్రా! నాముద్దుకుమారుని మనసార నరణ్యమునకు నాజ్ఞ వెట్టితినని యెంచితిరా? కటకటా! అకొడుకును బాసిన చండపక్షణమునే నేశ్మశానమున దగ్ధుఁడుకావలదా? ఎట్టిపాపముచేశ నే నీకైకకు వరముల నిచ్చితి. ఈకైకను జేపట్టి కులమువారికందరికిఁ బుత్రునకు, మీకు శాత్రవుఁడనైతిని. నిన్న సాయంతనమునకుముందు నేఁమృతిఁజెందియుండిన నాకీదుఃఖముండదుగదా? కైకా! కైకా! నినుగన్న కడుపు దగ్ధమగుఁగాక.

## అనుబంధము 23

కౌసల్య — రాజేంద్రా! నాప్రాప్తియిట్లుండ నాకైక యేమిచేయును. ఆమెన్వఁడిలు పింపుము. ప్రార్థించెదను.

దశ — కైకా! కైకా!

కౌసల్య — కైకేయీదేవీ! రమ్మిందు, నేవిన్నవింతు.

కైక — (వెనుకనుండి) నాకాయాసముగనున్నది. రాఁజాలను.

దశ — కౌసల్యా! దాని నేటికిఁబ్రార్థింపఁ బెంచెదు? ఏపనిచేయవలెనో యదిచేసె. ఇంకేల వచ్చును? అంతకైనఁ గరుణగల్గు దానికిఁగల్గను.

[ప్రవేశము: వసిష్ఠుఁడు-సుమంత్రుఁడు].

వశి — రాజేంద్రా? రామలక్ష్మణులు సీతాసమేతులై వచ్చియున్నారు.

దశ—హా! శ్రీహరీ!

వశి—నేనప్పుడే చెప్పితినే. దుఃఖముతో నేమిప్రయోజనము? ఇది దైవకృతేము. వారలఁ బిలిపింపుము.

దశ—ఋషితిలకా! ఇంక మనసు తాయిచేసితి. చావనున్నవానికి వగపేల? ఆ రాముఁడు కడమాటి నాయానతిఁగైకొన వచ్చియున్నాఁడా కాబోలు. రమ్మనుము. కడసారి వానిముద్దుమోము వీక్షించెదగాక.

[ప్ర: రాముఁడు-సీత (దూరమున లక్ష్మణుఁడు)].

లక్ష్మ—(స్వ) దశరథుఁడుగాని కైకకాని తుదకుఁ గరుణింపవచ్చునని యోచించితిని. ఊరకుంటి. కాని. ఇంకను వేళగలదు. ఈరాముఁను నేఁబోయిచ్చెదనని చెప్పఁ దశరథుఁడేడ్వ, నప్పుడైనఁ గైకకుఁ గరుణగలుగదా? నేనిందేయుండెద. అవ్వాళ మిథునము చేరయున్న యాగుహాలోనికిఁ బోవఁజాల. (నిల్చును).

రాము—(దశరథునికి నమస్కరించి) జనకా!

దశ—రామా! రామా! నీవునన్ను "జనకా"! యని పిలుచుటిదియే కడసారిగదా?

రాము—జనకా! ఊఱడిల్లుము. నీకేటికీవగట? పదునాలుగేండ్లేయని భీతిల్లెదవుగ శీఘ్రకాలమునసే యని నిండఁగలవనుట చింతింపవు. నే సంతోషమున నరణ్యములకేగెదనే నీకేటికీ సంతాపము? నీవలనఁత జెందిన నేనోర్వజాల. నే నిందుకుఁజాల. నీయానతిఁగైకొనకయే వెడలిపోయెద. ఈసీత నాసంతోషము నిమమడఁపఁజేసి. నేనెంత చెప్పినను మానక నావెంటవత్తునని పట్టుపట్టె. నేనునియ్యకొంటి. మీయాజ్ఞ యొకటియే వలయు. ఒంటిగానుండక సతీయుతుఁడనై యుండెదఁగదా? ఇంకేల చింతింపవలయు?

దశ
కౌసల్య
సుమిత్ర } హా! సీతా! సీతా!

రామ—మీరెవ్వరుగాని దుఃఖించిన నేనిందుండను. ఇదే వెడలెదను.

ద-సు-కౌ—మేము దుఃఖింపము-దుఃఖింపము. (దుఃఖింతురు).

రాము—మాకైకేయి మాత యెక్కడ?

దశ—కైకా! కైకా!

[ప్ర: కైక మంథరతో (ఒకప్రక్కను)]

మంథ—(కైకతో) నీకున్న ధైర్యమంతయు నిప్పుడే యుపయోగింపవలయు. తిరిగితి నా కార్యము దప్పును. (ప్ర) కైకా నిన్నిందఱు పిలుచుచున్న రాకున్నావు. ఏటికి నూరకుండకు. ముందుకరమ్ము.

లక్ష్మ—(స్వ) ఔరా! ఎంతసాహసిని యీమంథర! ఇదియంతయు దీనిపనియా?

కైక—ఏమి పిలిచితిరి?

కౌసల్య—సోదరీ! కైకా! నామాటవాలింపుము. నీకరుణావలోకము నాపైఁ బ్రసరింపఁజేయుము. నీకొడుకునకుఁ బట్టముగట్టుము. వలదనను. రాము నరణ్యమునకుఁ బంపుటమాత్రము మానుమా! అయ్యో! వాడు నీకొడుకుగాఁడా? నీకొడుకునకంటె రామునిపై నీకాదరణము మెండని యెన్నిమాఱులో చెప్పుచుంటివే. ఇదియా యిందులకు నిదర్శనము? నన్ను నాసుతుని బాపి నీవేమి సౌఖ్యమనుభవింప నెంచియున్నావు? నీచేతులంటి వేడుకొందును. ఈ యింతవిన్నప మాదరింపుము. జన్మమున్నంతవఱకు నీయనుగ్రహము మఱవను. కృతజ్ఞనై యుండెద. నను దాసిగా నేలికొమ్ము. నాకభయమిమ్ము. పుత్రభిక్షమిమ్ము.

## అనుబంధము 24

సుమి—చెలియా! ఈమాటమాత్రము జరుపుము.

## అనుబంధము 25

అయ్యో! నీవు నీయొక్క ధనముపోసినను నీయింటికి దాసిచెలి నినుజేతులంటి వేఁడుచున్నదే! ఏల నీకుఁ గరుణగలుగదు. దశరథసుతమాతలలో నొకతె నీవరణ్యమునకుఁ బంపనేవలయునన్న నాసుత లక్ష్మణ శత్రుఘ్నులిద్దరున్నారు. వారిలో నొకనిఁ బంపుము. వలదనను.

## అనుబంధము 26

కైక—రాజేంద్రా! నన్నిట్లాడిచేయుటకా పిలిచితివి?

దశ—హా! దైవమా! కైకా! కైకా!

కౌస—కైకేయీ! మఱియొక్కమాట. నీకుఁగరుణగలుగదు. రాముని నరణ్యమునకుఁ బంపుము. భరతుఁడిచటవచ్చువఱకు నిలుపునుపకారము చేయుమా. నేఁడే పంపవలయునను నంతటి పగయేటికి?

## అనుబంధము 27

ఈ పుణ్యముగట్టికొమ్ము. కరుణింపుమా. కరుణింపకున్న విడువను. నీయానబడుదును.
(కాళ్లపైఁబడును).

దశ — కైకా! ఇదిమాత్ర మొనరింపుమా. స్వల్పకార్యము. నీవు రెండుగాఁగోరిన వరములైన నడుగుము. ఇచ్చెదను. దీనిమాత్రమాచరింపుమా. నిను నమస్కరించి వేఁడుదు. (కాళ్లపైఁబడును).

కైక — (మంథరను జూచును)

మంథ — (వలదని సైగచేయును).

కైక — రాజేంద్రా! సవతులారా! ఏమిసొగసుమాటలేమిని? భరతుఁడు వచ్చిన వానిలోఁబఱచుకొని నన్నుఁ జెడ్డజేసి దేశభ్రష్టగాఁ జేయనెంచితిరా? నను గాడిదెపాలు పోసి పెంచినారనుకొన్నారా. రాజేంద్రా! ఈవాయాలితనము లేటికి? ఇందఱి యెదుట నన్నారడిచేయుచున్నారా? వరము లీఁజాలననుము. తీఱెనకదా?

## అనుబంధము 28

చం॥ భరతుఁడు వచ్చెనేని కడువంచన లోఁగొని వానిరాముని
న్దరణికి నిల్పనెంచితిరె దాని నెఱుంగఁగఁజాలనే నిధం
బరయని గోలనే యకట యంతటిమోసము నాకు లేదె నా
గరికత నాదుతల్లినను గాడిదెపాలిడి పెంచియున్నదే?॥

అందఱు — హా! శ్రీహరీ!

లక్ష్మ — (ఖడ్గముపట్టి లోనికివచ్చి)

## అనుబంధము 29

సభ్యులారా! చూచితిరిగదా? ఇందలిధర్మముల మీరాలోచింపుఁడు. వరములనఁగా నెట్టివి. తనను మేలుగాఁ గోరునవికదా? బ్రహ్మాదిదేవతలగూర్చి యెందఱు తపము లొనరింపరు? ఎందఱు వరములఁగోరరు. తమకిష్టమైనవి ఇట్టివి రావలయునని కోరుటగాక పెఱవారికిట్టి దుఃఖములుగల్గవలయునని వరములడిగిరే? కాబట్టి యీకైకేయి రామునరణ్యమునకుఁ బంపఁగోరినది వరమే కాదు. దాని నీయధిపుఁడీయఁబనిలేదు. అటుగాక, ఈమెను రెండువరములనుఁగదా స్వాతంత్ర్యము? రెండడుగు నెపమున నీమెయున్న వరముల వేఁడినదో విచారింపుఁడు. ఒకటి భరతునకుఁ బట్టాభిషేకముచేయుమని. దీనితోడనే రెండును దీరె. ఇంతవఱకు రామపట్టాభిషేకము నిశ్చితమైయుండినందున, దాని మానవలయునని యొకటియు, భరతునభిషిక్తు జేయవలెనని మఱియొకటియునగుఁగదా? ఇంకనీఁదగిన వరమెక్కడిది? కావున నెట్టివరమును ధరాధిపుడీయఁబనిలేదు. ఈ రెండఱియును వరమునను నెన్నియున్నవో చూడుఁడు. తపసివృత్తిమై, పదునాల్గేండ్లు

అరణ్యమున నుండ రాముని నేఁడే పంపవలయునఁట. అరణ్యమునకు రామునిఁ బంపవలయు ననుటయొకటి, పదునాల్గేండ్లుండఁ బంపవలయుననుట యొండొకటి, తాపసివృత్తిగలిగి యుండవలయుననుట యింకొకటి, నేఁడేపంపవలయుననుట మఱియొకటి ఇట్లునాల్గువర ముల నడిగినది. వీనినన్నిటి నీరాజేంద్రుఁడిచ్చవలయునను నిర్బంధమేమి? ఏవియెట్లిచ్చి నను, నేఁడేపంపుమని నిక్కచ్చిచేయుట యెట్లగు? భరతుఁడు వచ్చునఱకు నిలువుమని యీమెను వేఁడుకోనేల? అవశ్యము నిలుపవచ్చును.

వసి — భళిరే లక్ష్మణా! నీవింతయొప్పిదముగ మాటలాడుదువే!

సుమం — ఈయుక్తి యొకరికినిఁ దోఁపదయ్యెఁగా?

రామ — మీరేల సంతోషించెదరు? వరములుకానీ కాకుండనీ తల్లియడిగినది తండ్రి యిచ్చినాఁడు. నామేనఁబ్రాణములుండ నే నతని నసత్యవాదిఁజేయుదునా? ధర్మ సూక్ష్మవాదమున నేమివచ్చెను. నేఁబోవనేవలయు.

చం॥ వరములఁగోరెఁదల్లి జనవంద్యుఁడుతండ్రియొసంగెఁగానకే
నరుగఁగఁ దమ్మునిఁ గ్ష్మాపధరాధిపుఁ జేయఁగ నాకుఁదీఱునే
నెరవునఁదండ్రిమాట నడిపింపని పుత్రుఁడు పుత్రుఁడే గుణా
బరయుని ధర్మసూక్ష్మముల నాడఁగనేల వృథావివాదముల్॥

లక్ష్మ — రామా! నీకెంతటి యవివేకము? అశక్తునిభంగి నిట్లు మాటలాడనేల? నీవర ణ్యమునకుఁబోవనేల? తండ్రిమాటజరుపనేల? తండ్రియఁట వాక్యమఁట? ఇట్టితండ్రి మాటయా జరుపవలయు? ఈతండ్రియే వసిష్ఠాదిసంయములును సుమంత్రాదిమంత్రు లును, నిండిన యెడ్డోలగమున మొన్న నినుఁ బట్టాభిషిక్తుఁ జేసెదనని నీకు మాట యీలేదా? ఆమాట నెట్లు తప్పఁజాలువాఁడు? అది త్రిప్పిన నసత్యములేదఁట. ద్రోహకాంక్షచేసిన యొకభోగిని కన్నితరములక్రిందటనో యెవ్వరు నెఱుంగకుండ యిచ్చినయవివేకపుమాట తప్పిన సత్యభంగమఁట! ఎట్లును నీతని కసత్యపాపమే రానుండ నరణ్యమున నేలపోయెదవు? నీబంటు నే నుండ నీకేమికొఱంత. ధనువు పట్టినిలిచిన నెవరడ్డమురాఁగలరు? సప్తసాగరములఁ గలఁచి నైచఁజాలనా? కులా చలముల బ్రక్కలింపఁజాలనా? రామా! ఈపురివిడిచి ముందొక్కడుగిడకుము. మదనాతురుఁడై, వృద్ధుఁడై, క్రూరకర్మములనోర్చిన యీదశరథు మాటలేల విన వలయు? నాచేతులార నీకు నేన పట్టాభిషేకము చేయఁగలను. ఈ కౌక్షేయకము పట్టినిలిచి భరతాదులగు శత్రువర్గములఁ బరిమార్చెద. ఏయసతీసుతుఁడడ్డము వచ్చె డినో చూతము. ఈదుర్జాతిమంథర కలదుగదా? దీనినిప్పుడే — (కత్తియెత్తిపోవును)

కౌసల్య—లక్ష్మణా! (అని నిలిపి) ఈ మంధర నిరపరాధి. నేనెఱుంగుదును. దీనిం గనలకుము.

రామ—లక్ష్మణా! లక్ష్మణా! ఎంతమాటలాడితివి! ఎట్టిపాపముగట్టుకొంటివి! కోపమునం గలిగిన యనుతాపమున నరకకూపమునం బడిపోవుటకయ నైతివే.

ద్రుతవిలంబితము. తగునె నీతలిదండ్రుల నగ్గఱన్
వగవు పుట్టంగ బల్కితి తిట్టులన్
మిగులనిన్ను సుమిత్రయె కాంచెనో
వగం గిరాతకబాలునె పెంచెనో ॥

ఎవ్వరినింతగా నీవాడునది? దశరథునా? తండ్రియే. కైకనా? తల్లియే. భరతునా? అన్నయే. పితరులంగుఱించియు నగ్రజుంగూర్చియు నిట్లాడిన పాపమునకు నీకెట్టిప్రాప్తి ఘటిల్లంజాలదు! నీవు సుమిత్రకన్నవాండవనితోంపదు. ఎందో శబరకిరాతపల్లంబున నుద్భవించి దుష్ప్రాప్తిచే నిన్ను సుమిత్ర పెంచినట్లుతోంపం జేయుచున్నావు. నీతో సంభాషించిన దురితముగాదా?

తోటకము. తలిదండ్రుల నగ్రజుం దాలిమిలే
కలయించెడు పాపము లాడితివే
బలుకోపమ దెవ్వరికైన నికం
దిలకింపంగం బాపము నిముఖముల్ ॥

లక్ష్మ—(కత్తిపాఱవేసి) అన్నా! రక్షింపుము. కోపమున నరయలేనైతి. బ్రహ్మహత్యపాతకమునకు గుఱియైతి. (కాళ్లంబడును)

రాము—(లేవనెత్తి) ప్రియసోదరా! నీవు బుద్ధిగలుగుటకై కఠినపుమాటలాడితింగాక, నీసుస్వభావము నెఱుంగనా? నన్నేల క్షమింపవేండెదు? నిను క్షమింపవలసినవారు నీ పితరులుగదా?

## అనుబోధము 30

లక్ష్మ—జనకా! మహాశాంతగుణోపేతుండవగు నీకుంబుత్రుండననుపించుకొని యొకలు దెలియనుండం గాల్చిన కోకమునకులోంబడి నిన్నూరకదూఱితి. ప్రాయశ్చిత్తోపదేశ మొనర్చినను, ఈపాపము నాకుందప్పదు. రక్షింపుము, (దశరథుకాళ్లపైంబడును.)

దశ—తనయా! నీవేమంటివి? నీమాటలన్నియు యథార్థములు. నేంగామాతురుండు, గాననే యీపాపలనాశకర కీదుర్గాంకి వరములిచ్చితి. కఠినకర్ముండంగాననే యింత

కోర్చితి. నేనవశ్యము వధార్హుఁడ. నీచేతఁ గాకున్న వేఱొకఁడు భంగినైనఁ జావఁగల వాఁడ. ఏల వెనుదీసెదవు? ఇదే నా కంఠము. అదే నీ కరవాలము. (ఏడ్చును) నీ కేమియుఁ బితృవధపాపము కలుగకుండ దైవముం బ్రార్థించెద. కానిమ్ము.

రామ—అయ్యో! ఇటు దగునా? వీఁడు ప్రజ్ఞ లేమి నిట్లాడె. నింతయె. అవశ్యము క్షంతవ్యుఁడు.

దశ—రామా! నేను కోపమునఁ గార్పణ్యమున మాటలాడితినా?

లక్ష్మ—జనకా! నీవు క్షమింపకున్న నీ కరవాలమున నా జిహ్వా—(ఎత్తును).

దశ—(నిలిపి) పుత్రా! నీవొనర్చినది యపరాధమే యని నీ వెంచిన క్షమించితి. నిక్కముగా క్షమించితి.

లక్ష్మ—మనసారఁ గరుణించినందుకు నిదర్శనముగా నాకొక్క వరము నీవలయు.

దశ—అయ్యో! నా వరములు సన్నెగలికిఁ దెచ్చెఁ జూచియున్నాఁడవుగదా? అయినను బ్రియకుమారునికిఁ దగిన వర మేది యడుగుము.

లక్ష్మ—ఈ రాము వెంట నన్నుఁ బోవ ననుజ్ఞ యీవలయు. ఇదియే నా వరము.

సుమి—కుమారా! లక్ష్మణా! నీవు నా తనూజుఁడ వైనందులకు సార్థక మిప్పుడుగదా. సుకుమారుఁడగు రాముఁడు సుకోమలాంగియగు సీతతో నరణ్యముల కేగుచుండ వారికి రక్షగా నీవు పోవ వేడవలయునని యే యుంటి. అది నీవ కోరితివి.

రామ—లక్ష్మణా! ఇదియేమి కోరిక—

లక్ష్మ—నేను వెంటరా ననుగ్రహింప వేవలయు. (నమస్కరించును).

రామ—తమ్ముఁడా! లెమ్ము. నీవై యాదరపూర్వకముగ వెంటవత్తునన్న నేవలదందునా నాకుఁ జతుర్భుజములు కావా నీవుండిన? జననీజనకులారా! ఇంక మాకాజ్ఞ యిండు. పుత్రుల స్వల్పవియోగము గలిగెనే యని వంతఁగుందకుఁడు. నారచీరలనిండు.

కైక—(మూఁడు జతల నారచీలు నొకజత దారుపాదుక లిచ్చును.) కుమారులారా! ఇదిగో చీరలు, కొనుఁడు.

సుమం—(స్వ.) ఇట్టిపాపిజాతి యిట్టి కఠినమానస లోకమున లేదుగా!

దశ—హా! హా! శ్రీహరీ!

వసి—కైకేయీ! చూచి, చూచి యోర్చితిమి. ఇంకెంత యోర్వఁగలము. ఆ కేకయ రాజునకే యెట్టివేళ జనించితివి? నీ దుష్కృతి వలన ఫలమేమైన నున్నదని యెంచితివా భరతునికై కదా నీవిట్టి కటికిపని చేసినది? ఆ భరతుఁడు నిన్నాదరించునని నమ్మితివా? నీవు గడించిన యీ నీచసింహాసనమునఁ దన హేనుపాదమైన వాఁడూనునని యెంచిం

తీవా? అఘాతుఁడెవ్వడని యెంచితివి? వాఁడు శ్రీరాముని దశరథు ప్రతినిధిగాఁ జూచువాఁడు. అతనిమాట నీతియైన మీఱనివాఁడు. తనయన్న కిట్టిపాటుగలిగెనన్న వెంజెందికాందికలవాఁడా? వాఁడు దశరథునికొడుకేయైన, నినుఁదల్లిగా భావించునా? నీపాపపుమోము మరలఁజూచునా? అయ్యో! ఈ సుకుమారులకు నారచీరలివ్వ నీచేతులెట్లాడెను?

దశ—హా! కైకా! రామునికి నీవు తపసివేషము గోరితివిగాక, సీతకు లక్ష్మణునకుఁ గోరితివా? లోకవిదిత పాతివ్రత్యవిఖ్యాతినై, పుణ్యగుణోపేతనై, యనవరత సద్వ్రత సమేతనై, తగు సీతకా యిచ్చితి వీనారచీరలు? తెమ్ము. నా మణిభూషణ సందోహము. ఇల్లతయు నూడ్చితెమ్ము. సీతా! కోమలాంగుళకంజాతా! సుగుణ వ్రాతా! కొమ్మిమ్మభూషణములు. పాఱవేయుమా నారచీరల (తానే పాఱవేయును).

లక్ష్మ—జనకా! నాకివియే యుండనిమ్ము.

రాము—తల్లిదండ్రులారా! మాకింక నాజ్ఞయిండు. జనకా! ఈకైకేయిమాతను మీరు నిరాదరణ మొనర్పరాదు. నాకహితకార్య మీమె యేమియు నొనర్పలేదు. ఆయమ నొక్కింతయు నోనాడవలదని ప్రార్థించుచున్నాను. ఈకౌసల్యాసుమిత్రా దేవులు పుత్రులు దండలేకుండుటఁజేసి వగచుచుందురు. వారలచింత వారింపవలయు నింపు భరతుఁడే తెంచిన మా నాఁడీవాదముల వచింపుము. రాజ్యము గైకొనుటకు వాఁడే నైన సంకోచించిన మనఃపూర్వకముగ నే నొసఁగెదననియుఁ బరిపాలింపవలయు ననియు వచింపుము. అమ్మలారా! మాజనకునిపై నించుకైనఁ బరామరిక తప్పకుండ వలయు. అతఁడు వృద్ధుఁడు. ఊరక నాకొఱకై చింతఁబూనినాఁడు. మీభక్తి శ్రద్ధల నతనిచింత నుడిపి పాలింపవలయు. భరతునిఁ గరుణింపవలయు. వాఁడు మీయెడలఁ బరమభక్తిపరుఁడు. మా మాఱుగ మీదండనుండువాఁడు. ఇంకాన తిండు.

దశ—రామా! అట్లయినఁ బోయెదవా? ఇదియే నీకడచూపని నాకుఁ దోఁచుచున్నది.

రాము—జనకా! ఆమాట లనకుము. మమ్మాశీర్వదించి శుభముగఁ బంపుము. కన్నీరు నింపకుము. ఇదె నమస్కరించువారము. (సీత రామ లక్ష్మణులు నమస్కరింతురు)

దశ—పుత్రా! అయినఁ బోయెదవా? నాయత్నము లేదు.

సీ॥ కులశేఖరుని నిన్ను ఘోరాటవులకు నే
డంపితి నని సన్నుఁ గనలక న్న
కైకపాపముగాక గలుగదు నాపాప
మించుకంతయు నాచె నెంచవన్న

మాఱుఁజాలమిఁ జేసి మితిమీఱి కలిగినీ
యుమ్మలమని నీవు నమ్మవన్న
సడలించు శోకంబు సాఁకఁజాలక యున్న
నేఁజచ్చినప్పుడైన నెఱుఁగవన్న
తే॥గీ॥ మగువ నీసీత వన్నుల నేమఱకన్న
పిన్నతమ్ముని గరుణచేఁ బెంపవన్న
మాతలను నన్నుఁదమ్ముల మఱవకన్న
భూరియశమున మఱిపురిఁ జేరవన్న ॥

కైకేయిక్రూరపు దలంపున గుణభూషణుఁడవగు నిను ఘోరారణ్యముల పాలు చేసితిఁగాయని నన్నుఁగనలకుము. ప్రాప్తము నెవరు దప్పింపఁజాలుదురు? కటకటా! హంసతూలిక పాన్పుపైనుంచినను, గందుపాఱెడు లేమేను గులకరాళ్లపై నెట్లుండునో ఎండకన్నెఱుఁగక సౌధములనుండినను గసిగందు మోముఁదమ్మి వర్షాతపముల కెట్లోర్చునో? మెత్తని చిత్రాసనములఁ ద్రొక్కినను గ్రొన్నెత్తురుబ్బు పదము అరణ్యకంటక శిలా ప్రదేశముల నెట్లు సంచరించునో? నే నేమనియేమి ప్రయోజనము? ఈ సీతాలక్ష్మణులు నీకై మోహమునఁ బాయక చనుదెంచెదరు. వీరిఁ జక్కఁగా నరసికొనుము. ఈసీత సుమకోమలి. ఆకాఱడవుల నెట్లు వర్తింపఁగలదో? అలయకుండఁ గాపాడవలయునుమా. సీతా! నీపతివెంటఁబోవు పాతివ్రత్యమునకు మెచ్చితి. మీరుపోవు విపినంబుల భీకరమృగములును, రాక్షసుల నెలవులు నుండఁగలవు. నిర్భయముగాఁ దిరుగాడకుమా. వీరిరువురిలో నొకరు వెంటరాక యెందునుఁ బోకుము.

పృథ్వీవృత్తము.

పురాకృతముదప్పనే పొగులకమ్మ నీకైనయీ
కరాళగతికిన్నమున్ననలకమ్మ యెందైనసా
యరణ్యములనొంటిగా నరుగకమ్మనిర్భీతిగా
మరాళగమనా మమున్మఱవకమ్మ యోకోడలా ॥

కుమారీ! పోయిరమ్మా.

మంథర—(కైకతో) ఇంకమనము పోదమురమ్మా. అప్పుడే నీవేడ్పు మొగము పెట్టితివి. ఏమిచేయుదువో—

(రామ, సీత, లక్ష్మణ— కౌసల్యకు నమస్కరింతురు)

కౌస — రామా! ధీరమానసమున నంతయుఁ బర్యాలోచించి చూచియున్నాను. అన్నా! పోయిరమ్ము. ఈలక్ష్మణుని సీతను నేమఱకుము. వీరవరయు నెడ నెంతశ్రద్ధ యున్ననుఁ దక్కువేయగు. (రామునితల నివిరి యాలింగనముచేసి) రామచంద్రా! దేవతలు, ఖేచరులు, దిక్పాలకులు, చంద్రుఁడు, సూర్యుఁడు, బ్రహ్మ, విష్ణు,మహేశ్వరులు, పృథివ్యాదిపంచభూతములు, శ్రుతులు, శాంతిదాంతులు, యతులు, నదులు, తరులు, గిరులు, దశదిశలు, సమస్త జీవరాసులు, సప్తాధోలోకముల సప్తోర్ధ్వలోకములనున్న ప్రాణిసందోహము నీకెప్పుడు క్షేమముగలిగింతురుగాక! (చేతికి రక్షగట్టి), రామా! దీనిబాయక రక్షించుకొనుము. అలనాఁడు తనతల్లి దాస్యముఁ దీర్ప నుద్దేశించి సర్వప్రయత్నముల దేవతలజయించి దేవలోకమునుండి యమృతముఁ దెచ్చుటకుద్యమించి మ్రొక్కి యెదుటనిలిచిన గరుత్మంతున కాతని తల్లి యెట్టిదీవనలొసంగెనో యాదీవనలు నీకుఁగలుగనిమ్ము. అజేయుఁడై సర్వాయుధాభేద్యుఁడై సురలఁ బాఱఁదోలి సురపురి నాక్రమించియున్న వృత్రాసురుఁజంపు నుపాయము గానక తొల్లి దేవేంద్రుఁడు విష్ణువువలన ననుజ్ఞవడసి స్వసాధుగ్రుల సమకూర్చికొని ఋషి ప్రముఖులగు దేవతలకు మ్రొక్కి నిలిచి వృత్రుపైఁ బోవుట కనుజ్ఞవేఁడగా, నాదేవతలాతని కేమంగళముల నిచ్చిరో యామంగళములు నీకుఁగానిమ్ము. మఱి బలిదానవనేత దేవేంద్రుని స్వర్గమపహరించి యలఘులీలఁ బాలింపుచుండ, నింద్రుని స్వత్వమింద్రునకుఁ జేర్పనుద్దేశమున జనించిన వామనమూర్తిబలీంద్రు ధరాదాన మడుగఁగోరి యటుపోవ నాతని వేఁడి తనతల్లి యదితికి మ్రొక్కి నిలువఁగా రాజ్యభ్రష్టులై కడుహీనస్థితినున్న యింద్రాదిసుతులఁ గాపాడికొనుచు గహనాంతరసీమల నిరుపేదభంగిఁ గాపురమున్న యాయదితి యా వామనున కెట్టి విజయములఁ గోరెనో యావిజయములు నీకుండనిమ్ము తనూజా! పోయిరమ్ము. లక్ష్మణా!

శా॥ అన్నా లక్ష్మణ నిష్ఠురాటవుల నాహా యెట్లు కాపాడఁగా
నున్నావో రఘురాముఁ గోడలిని నిత్యోత్పాతముల్మ్రన్చినీ
వున్నావంచుఁ దలంపనూఱటయు నాకొక్కింత చూపట్టెనా
కన్నుఁజ్జల్లనగా వధూతనయభిక్షంబిచ్చి మన్నింపవే॥

నీవు రామునివెంట నేగెదవను కారణముననగదా యింత ధైర్యము వహించి యున్నాను. నీయన్నను వదినియను నిష్టురాటవిల బాధలొందనీక మరలఁ బురముఁ తిఁ జేర్చవా నాకునీవ పుత్రపుత్రీదానమిచ్చిన వాఁడవగుదుసుమా. సీతా! ధరణీజాతా!

సీ॥ మితభాషణములాడు సతివౌటనుసొంపు
నింపు నీమాటలాలింపనైతి
మిగులఁజూచిన దృష్టితగులునోయనుభీతిఁ
గన్నులారఁగనిన్ను గాంచనైతి
చిఱుతసిగ్గున నీవు చేరరాకుండట
నింపుగా నినుఁగౌగిలింపనైతి
సుతను మించినకూర్మి యతివ యోకోడలా
కడఁగినీశుశ్రూషఁగాననైతి

తే॥ గీ॥ బాల నినుసేఁకు గానలఁ దోలుటాయె
నెటుల వేఁగింతునమ్మ త్రోయింతునమ్మ
వంతఁజాలింతునమ్మ తలంతునమ్మ
యెంతునమ్మ ప్రాణముల భరింతునమ్మ॥

చక్రవర్తి కుమారుఁడనియుఁ, జక్రవర్తిపదమునకు రాఁగలవాఁడనియు, నమ్మి జనకుఁడు నిను మారామునకిచ్చెను. ఎల్లప్పుడు నిను గారాముగాఁ బెంచిన మిథిలానాథుఁడు నిన్నఱచేత నిడుకొని కాపాడి తనయట్టివారిఁగా భావించి నినుమాకోడలిఁ జేసెను. అట్టి నిన్నుగుట్టలఁబట్టించి జనకరాజున కెంతయు నపరాధమొనర్చితిమి. ఇప్పుడతని మానసమెట్లుండఁగలదో. విధిబలముచేనైన యీకార్యమునకు మమ్ముఁగనలకుమా! నిన్నుఁబొమ్మనఁజాలము పోవలదనఁజాలము. పరమసుస్వభావమునను, సముచిత సాధ్వీగుణంబునను, ధీరపతివ్రతవై నీపతివెంటఁ గానలకేగుటయే విహితము, సముచిత సతీగుణ సమపేతయగు నిట్టికోడలు మాదండనుండుటకు నోచనైతిమి. మాసంతాప మాదైవమేయెఱుఁగు. ఎట్లును బోవనున్నావు. పోవఁగలవు-పోయెదవు. ఎట్లయినఁ జింతమాన యత్నింపుము. పతివ్రతాతిలకమవగు నీకు నేఁ జెప్పవలసిన ధర్మములేమున్నవి? జనకుండు నిన్ను మావశముచేసినదికల్ల. నాయిరువుర ముద్దు కుమారుల నీవశమిప్పుడు నేఁ జేయుటయథార్థము. వీరలనెట్లరసెదవో. వేళ వేళకు భోజనమిడి వలసిన యుపచారములఁ జేసి యెట్లు రక్షించెదవో, పూజనీయురాలవై మఱల సౌఖ్యముగ నీపతితో మఱఁదితో మావీటి కరుదెంచి నాయాశీర్వాదము నెట్లు పడసెదవో. సీతా! మిథిలాపురినుండి తెచ్చితివే ముద్దుచిలుకల వానినెందుంచిపోయెదవు? నీయాకలియైననుమాని వానినిఁ బోషింపుచు వచ్చితివే. అరణ్యముల రామలక్ష్మణుల నట్టిచిలుకలేయని యెంచుమా! అమ్మగో! పొమ్ము. ఈపదునాల్గేండ్లు మమ్ము మఱవకుము. అక్కటా! కాదు మరచిపొమ్ము. (ఏడ్చును).

దశ—హా! నిర్భరము. సతీమణులారా! మీరందఱుఁ బయనముకండు. సుమంత్రా! పురివారినెల్ల నరణ్యమునకుఁ బ్రయాణము గమ్మనుము. చతురంగబలములతో సర్వ సంపదలతో నేనుం బోయెద. ఈపాదూరు భరతుఁడేయేలెడుఁగాక. ఈవిధవయు—

కైక—

మ॥ ధరణీపాలక నేవరంబునుగ సాంద్రఖ్యాతిఁ బాదూరికిన్
భరతుఁ బట్టముగట్టనిచ్చితివె నీపాఁడిత్వ మింపాయెనా
వరమీలేననుమింతయేల సుతుతో బల్కానకుఁ బోయెదన్
ఇరవారంగసుఖంబుగామనుఁడు నీయిల్లాండ్రు మీరందఱున్ ॥

రాజేంద్ర! పాదూరికా నీవు భరతునిఁ బట్టముగట్ట వరమిచ్చినది? వనముకే యివ్వనము. నీయాంధ్రతో నీవే సుఖముండుము.

దశ—హా! దైవమా!

రామ—జనకా? ఈమాటలేల? సుమిత్రాదేవీ? మారుసెలవా?

(రామ-లక్ష్మ-సీత నమస్కరింతురు).

సుమి—తనూజులారా! కోడలా! నేనేమి వచింపఁగలను? అన్నా! లక్ష్మణా!

తే॥ గీ॥ తనర దశరథుఁగా రాముఁదలఁపవన్న
ఎలమి సీత "మాయమ్మ" యంచెంచవన్న
ఆయరణ్య మయోధ్యఁగా నరయవన్న
సుఖము దీపింప మఱినన్నుఁ జూడవన్న ॥

పతివ్రతాతిలకమై శాపానుగ్రహ సామర్థ్యవిరాజితయై యొప్పు కౌసల్యాదేవి మంగళశాసనములుండ మీకేమికొఱంత.

రామ—కైకేయిమాతా! నీవు మమ్మాశీర్వదింపుము.

దశ—హా! హా! వలదు. వలదు ఇంత యాశీర్వాదమే చాలదా?

కైక—వరములిచ్చునారింగటిమి. ఇంత యేడ్చువారిఁ జూడము. (నిష్క్రమింతురు)

## అనుబంధము 31

రామ—వసిష్ఠసంయమీంద్రా! మాకనుజ్ఞయా? (రామ,లక్ష్మణ,సీత నమస్కరింతురు)

వసి—రామా! నిన్ను నేనేమాశీర్వదింపఁ గలను? నీవెందున్న నదియే పరమస్థానము. దుష్టనిగ్రహమును, శిష్టానుగ్రహమును, నిర్జరామోద విభూతియు, శాత్రవప క్షకంధగహనణ విఖ్యాతియు, నీకు సిద్ధించుఁగాక.—

రామ—సుమంత్రా! ఇంకఁ బోదముగమ్ము. (రామ-లక్ష్మ-సుమంత్ర నిష్క్రమింతురు)




ఆంధ్రనాటక పితామహుని దశరథుని పాత్రములు (అం. 2 రం. 3) మదరాసు 1911

దశరథ }
కౌసల్య } హా ! మా భాగధేయము, మా జీవరత్నము పోయె. (మూర్ఛిల్లుదురు)
సుమిత్ర }

[ప్రవేశము : పౌరులు—(ఆయి-పౌరక మొదలైనవానితో విధవయు]

## అనుబంధము 32

పౌరులు—ఆదుర్జాతి కైకయేది? ఆపలుగాకి మంధరముండ యెక్కడ? ఆ యవివేకి దశరథుఁడేఁడి?

కౌస—పౌరులారా! ఏమి యిట్లువచ్చితిరి?

పౌర—ఆ మంధర విధవయేది? పలుగాకి కైకయేది? అడచెదము. పొడిచెదము-తాఁతేఁ గొట్టెదము. గుండు వేసెదము. పొరకతోఁ గొట్టెదము.

దశ—పౌరులారా! ఆఘోరపాపుఁడ నిందేయున్నాను.

పౌర—మొత్తు-తన్ను-కొట్టు-చంపు.

1. పౌర—ఈరాజు నేమిచేసి యేమి ప్రయోజనము? వరములిచ్చి మిడుకుచున్నాఁడు. కైకను మంధరను పట్టుదము.

2. పౌర—ఏకీ! ఎకీ! వెదకుదము. పట్టుదము. నఱకుదము.

1. పౌర—ఓకీ! ఈగదిలోనికిఁబోయి తల్పులు వేసికొనియున్నారు.

పౌరు—వాకిండ్లు పగులఁగొట్టుఁడు. గోడలు పడఁద్రోయుఁడు. (కలకలము చేయుదురు)

1. పౌర—రావురా యీవాకిండ్లు?

2. పౌర—అయింటికట్లనే యగ్గిపెట్టుఁడు. దగ్ధమైపోవనీ.

1. పౌర—ఇంటిలో నగ్నియెందున్నదో వెదకుఁడు. వెదకుఁడు.

కౌస—పౌరులారా! ఇట్టియరాజకమా? దండించువారెవరులేరా?

పౌర—రాముఁడు పోయినపిదప మాకు రాజెవ్వఁడు. మాటలాడకుము. చిక్కినవారిఁ జంపుదుము. చావఁగొట్టుదుము.

1. పౌర—కొట్టుఁడు. కొట్టుఁడు ఎవ్వతైననేమి? ఎవ్వడైననేమి?

### పునః ప్రవేశము: లక్ష్మణుఁడు—(శీఘ్రముగ.)

లక్ష్మ—పౌరులారా! ఇందేమి చేయుచున్నారు?

పౌరు—ఇదిగో! యగ్ని-ఈయింటికగ్గిపెట్టుచున్నాము.

లక్ష్మ—పొండిక్కడనుండి. ఇంతయాజ్ఞ లేనివారుందురా?
పౌరు—వీఁడేమిరా! మాటలాడుచున్నాఁడు. కొట్టుఁడు కొట్టుఁడు.
లక్ష్మ—దురాత్ములారా! చచ్చితిరి. (విల్లెక్కు పెట్టును).

[పునః ప్ర: (శీఘ్రముగ) రాముఁడు]

రాము—లక్ష్మణా! ఈవిల్లేటికి? పౌరులారా!
పౌర—ఓరీ! రామచంద్రుఁడు మాటలాడుచున్నాఁడురా! వినుండు. వినుఁడు.
(నమస్కరింతురు.)
రాము—ఏమి సేయుచున్నారు ఇందు?
పౌర—కైకను మంథరను గాల్పఁబోవుచున్నాము.
రాము—ఇట్టి మాతృద్రోహులుగలరా! ఊరకపొండు. రాజుభార్య మీకుఁదల్లి గాదా?
2. పౌర—తల్లియైనను మానము. తండ్రియైనను మానము.
1. పౌర—రామచంద్రునితోనం యిట్టిమాట లూరకుండుము.
రామ—పౌరులారా! మీకు నమస్కరించెదను.

అనుబంధము 33

పౌర—అయ్యో! అయ్యో! (నమస్కరించి నిష్క్రమింతురు)
రాము—లక్ష్మణా! ఇక్కడనుండియే పోవుదము. అందుఁబోయిన మాయయ్య యున్నాఁడాలస్యమగును.
రామ—(రథముపైనఁ గూర్చుండి) సుమంత్రా! ఇదె మాయయ్య వెనువడి వచ్చుచున్నాఁడు. రథము వేగముగఁబోనిమ్ము. (నిష్క్రమి)
దశ—(వెంబడించుచు-కౌసల్యతో సుమిత్రతో).

కం॥ కలుషంబె కాని యున్నతమె
బలియని నరకంబె కాని వరములనీయక్
పలవించిపిల్చు జనకుని
యులుకారఁగనింత తిరిగి యోయనియన నే॥

సుమంత్రా! సుమంత్రా! రథమునిల్పుము. సుమంత్రా! (గట్టిగనరచి) అయ్యో! రథముపోయె. ఏపుణ్యాత్ములైన దాని నిలుపరే. మారాముని నాకిచ్చువారు లేరే. ఈసుమంత్రుఁడెట్టి దురాత్ముఁడు! ఎంతవేగముగఁదోలుచున్నాఁడు. రథపుటెక్కెమైనఁగనఁబడదే! అయ్యో! ధూళియైనఁగానరాదే! రామా! రామా!

## అనుబంధము 34

(మూర్ఛిల్లును.)

కౌస, సుమి — హా! నాథా! (శిశిరోపచారములు చేయుదురు)

దశ — కౌసల్యా! రాముఁడుపోయెఁగా? పోయెఁగా మా రాముఁడు?

కౌస — ఈవిధినేమి. యీదుఃఖము పోదమురమ్మా.

దశ — ఎక్కడికి?

కౌస — అదియేగదా కైకయిల్లు?

దశ — కైక! కైక! ఎవ్వరా కైక?

కౌస — హా! దైవమా!

దశ — కైకగదా? తెలిసెను. దానిభవనము కలుషమూలకందము. నీయింటికిఁ బిలుచు కొనిపొమ్ము. (యవనిక పడును)

### ద్వితీయాంకము-సమాప్తము.



శ్రీ

# పాదుకాపట్టాభిషేకము.

## తృతీయాఙ్కము.

### ప్రథమరంగము - కైకేయీనగరు.

[ప్రవేశము: మంథర]

మంథర — అబ్బా! ఇప్పటికి నిమ్మళముగాఁ జావుదప్పెను. నేనేమి చేసియున్నాను? ఎవ్వరొకరు నన్నిట్లేల తిట్టవలయు? నా యదృష్టవమ్మైన కౌసల్యయుండకున్న, లక్ష్మణుఁడు చంపుచుండెనేమో! ఈయూరిదుర్మార్గులా యింటికగ్ని పెట్టవచ్చిరి. ఈ విధవాసంతులందఱు రాముని వెంటఁ బోదయిపోయినారని తెలియుటవలన నేనుఁ గైకయు వెలికి రాలైతిమి. ఏమయిననేమి? కార్యమేమో ముగిసెఁగదా! ఇంకెందుండిన నపాయము. గిరివ్రజపురమునకుఁ బోయెదను. పోవుదమా వలదాయని యోచించుచున్నాను. పాలు ద్రాగుదునా? పాయసము భుజింతునా? ఇప్పుడే వెడలి పోయిన నిక్కటక మంటయేమో పెట్టినట్లాయను. పాలు ద్రావినయట్లౌయగును. ఇందే యుండి భరతుఁడు రాజ్యమేలఁగాఁ గైకనుమాఱుగా సర్వాధికారములు జరుపుచు నన్నుఁ దిట్టుచు వచ్చిన యీయూరివారలపైఁ గసియంతయుఁదీఱ నీవిధవలను విధవాసుతులను బాధించి పీడించి వేధించితినా, పాయసముదిన్నట్లగును. పాలకంటెఁ బాయసమే మేలుగదా? అయిన భరతుఁడేమైనఁ గైకపై విరోధముఁజూపెనా యప్పుడది పాయసముగాదు విషముద్రాగినట్లగును. దీనికేమిచేయవలయు? అట్లేలగును? భరతుఁడేమి మనుష్యుఁడుకాఁడా? పెండటనొకవేళ సంకటముగలిగినను, నేకచ్ఛత్రాధిపత్యముగాఁ జక్రవర్తిపదముగలిగినందులకు సంతసింపకపోవునా? సంతసించినపుడిట్టి భాగ్యముఁ దనకుఁగలిగినందులకుఁ గైకను మెచ్చకుండునా? మెచ్చినపుడా కైక యీమంథరాసతీమణియుపాయమే తన్నిట్టి సుస్థితికిఁదెచ్చెనని చెప్పక పోవునా? అప్పుడు నేనెట్టిదాననగుదు! భళీ భళి! ఈలోకమున నెవ్వరుపొందని యుచ్ఛాయపదవి నాకుఁ గలుగుఁగా! భరతుఁడెట్టి రాచకార్యమైనను నాతో నాలోచింపక చేయునా? భరతుఁడేల నేగదా రాజ్యమేలుదానను? అదిగాక భరతునిపై నాకిష్టము — ఏదో "మోహ"మందురుగదా? అదిపుట్టియున్నది — పాంచాలువిను ముంద

టిచ్చుట నెవ్వరుతెలెరే? పుట్టియున్నది. నాయభీష్టమునకు భరతునివలన సమ్మతిగను గలిగినను గలుగవచ్చు. రూపమునఁ గాకుండినను, బుద్ధిచే మోహింపఁడా? నేనించుక దయను చెల్లినదానను. నిజమే అయిన నేమి? ఏపుట్ట నెంతపాముండుటయు నెవ్వ రెఱుంగుదురు? కావుననే వానికీసంతోషావంతను నప్పుడే జాబువ్రాసి తెలియఁజేసియున్నాను. నాయోచనా విశేషమువలనఁ దనకే సౌఖ్యముగలుగ నున్నదని తెలియఁజేసినాను. నాయభీష్ట మొకటి నెఱవేఱినా యింకేమున్నది? భళిరే! ఏకో యింతాయాసముగా నున్నదని నేఁజెప్ప, మాండవియొక చరణమును కైక మఱియొక చరణమును, నొత్తుచుండ భరతచక్రవర్తి యడుగడుగునకు "దేవి కట్టున్నది" విచారించుచుండ నాభోగమెంత రాణించును! కానీ! ఊరక ముందుముందే "గొంతెమ్మకోరిక" లెందులకు? జరిగినప్పుడుగదా యనుకొనవలయు? జరిగినప్పుడుగదా ఫలము? ఏలజరుగదు! నేనెంచినంతకంటె నెక్కువగా జరుగును. నాకూఁగలిగెడు కొడుకేభావిచక్రవర్తి కాఁడునా? అదిగో! కైకవచ్చుచున్నది. మగనియొద్దను సవతియింటికిఁ బోయియుండె. అదియేమిట్టి మోమున వచ్చుచున్నది? రేవునకుఁ బోవుదానివలె నున్నదే!

[ప్ర: కైక—(దుఃఖముతో)]

కైక—మంథరా! ఎంతపాపాత్మురాలవే! నీమాటవిని యెట్టిగతి తెచ్చుకొంటిని!

## అనుబంధము 35

నానాథునికిఁ బిచ్చిపట్టియున్నది. కలువరించుఁగాని మనుష్యులపైఁ బ్రజ్ఞలేదు. ఈ ప్రజ్ఞలేనివేళ సయితము కైకవచ్చినదన్నఁ బెడమోముచేసి నన్నుఁ జూడఁడాయె. అయ్యో! ఆముఖమునందలి శుష్కభావముచూడ నతఁడు జీవించునట్లులేదు.

మంథ—కైకా! దైవము నీకేమినోరాడించుచున్నాఁడే "మగఁడుచచ్చును. మగఁడు చచ్చునని" మొత్తుకొనుచున్నావు. పెద్దకొమారుఁడు పదునాలుగేండ్లవఱకు గాని యూరికిఁబోయియుండ శుష్కభావముండదా? నేఁడు శుష్కభావముగానుండిన రేపు సగము శుష్కము. మఱునాఁడు పాదశుష్కము. నాలవనాఁడు, ఆర్ద్ర మగును—ఎన్నిదినములుండఁగలదు?

కైక—మంథరా! అంతయేకాదా? ఏమియుభయములేదుగదా?

మంథ—భయమేమున్నదే? అదియుండనీ, నీకొడుకు చక్రవర్తి యయినంతనె నన్ను మఱువవు కదా?

కైక—అదియుండనీ, మంథరా! రాముఁడెట్టి మహనీయుఁడే! చంపవచ్చిన లక్ష్మణుని నను బుద్ధిచెప్పెను. ఎవరివలనను మరలని పౌరుల మరలించి మముఁదప్పించెను. ఇట్టి వానికెట్టి యపకారమెంచితి!

మంథ—కైకా! నీవు పాలుద్రావ నేరవుగదే. దీనినంతయు నమ్మితివా? రాముఁడు, లక్ష్మణుఁడు, కౌసల్య, పురజనులు. మాటలాడుకొని నీయెదుట నిట్టి నాటకమాడి రాముఁడెంత సంభావితుఁడుగా యని నమ్మి నీవు కరుణింపఁజేసిన కుహకముగదా?

కైక—మంథరా! అట్లనా? అంతయేయుండునా?

మంథ—అంతగాకింకేంత? లక్ష్మణుఁడు దశరథునిఁదిట్టువాఁడో? తిట్టెంబో, అంత కోపము, అంతధర్మశాస్త్రవాదము గలవాఁడు, రామునిమాటనే చచ్చినట్టూరకుం డుట స్వభావోక్తియగునా? దశరథుఁడుచెప్పినను, కౌసల్యబెదరించినను, లక్ష్మణుఁడుధనువెత్తినను, మాననిపౌరులు రాముని యొక్కమాటకే, కుదురుకొనుట స్వభావోక్తియా? రాముఁడంతయే మొనర్చియున్నాఁడు? ఈయతిశయోక్తివలననే సంవిధానమేర్పడుఁగదా? అదిగాక రథమునెక్కి పోయిన రామలక్ష్మణులు మరల నెట్లు వచ్చిరి?

కైక—మంథరా! ఇప్పుడొప్పితిని. నీవెంత గుఱుతించినావే! ఎంతయుపాయమే!

మంథ—నా యుపాయమిప్పుడేమి? భరతుఁడు రాజ్యమేలునప్పుడు కనుగొందువు.

కైక—భరతుఁడన్న జ్ఞాపకముగలిగె. వసిష్ఠుఁడేమేయిట్లాడెను? భరతుఁడు రాజ్యమొల్లఁడఁట. రాముఖము నైనఁజూడఁడట. ఇట్లగునా?

మంథ—తొల్లిఁ గొంచమట్లనే జరుగవచ్చును. "తల్లి క్రూరకృత్యమున రాజ్యము సంపాదించినంతనే కొంకులేక రాజ్యమేలెడుగా భరతుఁడు" అని జనులందురను భయమున నట్లేచేయవలయు. నానాఁటనదియే చక్కఁబడును.

కైక—ఎట్టియుక్తియున్నదే నీమాటల? నీవు నాకుఁజెల్లెలవు. (కౌఁగిలించుకొను).

మంథ—చెల్లెలనును. కోడలనును. దయమాత్రముండనిమ్ము.

కైక—మంథరా! మఱియొకమాట. కౌసల్యకేటికే నీపైనభిమానము నీవు నిర్దోషివనెను.

మంథ—అందునను మోసమే. నీవునాస్వాధీనమని యెంచి నన్ను స్తోత్రముచేసిన నేనుబ్బి తనను మేలొనర్పవలెనని యుక్తి. ఇట్టికుండల నే నెందఱినో చూచినాను. ముందు యోచనలు మిక్కిలిగానున్నవి. పోదమురమ్ము. (నిష్క్ర—)

---

## తృతీయాంకము-ద్వితీయరంగము.

### కౌసల్యయిల్లు

[ప్ర: దశరథుఁడు(పండుకొని) సుమిత్ర, కౌసల్య వసిష్ఠుఁడు (ప్రక్కన).

వసి—నేఁడు కొంచెము గుణముగనున్నదా?

దశ—ఏఁడుదినములైనదా నేనిద్రించి?

వసి—రాజచంద్రా! ఈ యేఁడుదినములనుండి నీకు శరీరముపై నించుకైన స్మరణయుండ లేదు. నేఁడు తెలివిగలిగినందులకు సంతసించితి.

దశ—సంయమీంద్రా! ఇంకేటి సంతోషము? మనసున దావాగ్ని పుట్టియున్నది. దహించుచున్నది. పాపాత్ముఁడనైనందున నాతెలివిలేని సమయమునఁ జావనైతి. క్రొత్తక్రొత్తగఁ దెఱలు తెఱలై యుద్భవించు దుఃఖమున మరల మరలఁ గళ్లికళ్లి మృతిఁజెందఁగదా యీతెలివి వచ్చె.

వసి—రాజేంద్రా! చింతింపకుము యోచనీయములైన విషయము లనేకములున్నవి. రాముఁడరణ్యమునకుఁ బోయినరాత్రియే నీకుమతిదప్పె. నీసమ్మతి వడయక యేకార్యము చేయుటకులేక యూరకున్నాను.

దశ—హా! ఋషివర్యా! నీవలన నెట్టిమాటవింటిని! రాముఁడరణ్యమునకుఁ బోయెనా నేనమ్మను. పొఱపడితిరి. ఇందే యూరనుండవలెయు. విచారింపుఁడు.

వసి—అయ్యో! యేమిచేయవచ్చును?

దశ—అదిగో! రాముఁడిక్కడనే వచ్చెను. రామా! చూడుమా! నిన్నుఁదలు నరణ్యమునకుఁ బోయినాఁడందురు. ఇటురమ్ము. ఏలదూరముపోయెదవు? ఇంకేలయోచన? వరములడిగిన కైక మృతిఁబొందె. ఇంకేమటంకము. పట్టముగట్టికొమ్ము.

వసి-కౌస / సుమిత్ర } హా! మరలఁ గలిగెనే మతివిభ్రమము.

దశ—మతివిభ్రమము! నాకెక్కడిదే మతివిభ్రమము. కైకచచ్చుట యబద్ధమా! రామా! నీనైన వీరికిఁ జెప్పుము.

వసి—హా! శ్రీహరీ!

దశ—శ్రీహరీ! శ్రీహరీ! ఏమి శ్రీహరీ? రామా! చూడుమా వీరల్ల "శ్రీహరి" యనుచున్నారు. కౌసల్యా! కైకేయిశవము దహింపఁబడెనా?

వసి—ఇప్పుడు తొందరపెట్టకుఁడు. తర్వాత కార్యాలోచన చేయుదము.

దశ — కార్యాలోచనములు? కార్యాలోచనములేమి? రామునకుఁ బట్టముగట్టుటకంటెఁ గార్యమేమి? రామా! పోయిస్నానముచేసిరమ్ము. ఆనారచీరలు విడుపుము. (మెల్లఁగా) పొమ్ము-పొమ్ము—(నిద్రించును)

వసి — రాజేంద్రా!

దశ — (ఊరకుండును)

వసి — కొంచెము నిద్రపట్టియున్నది. తెలివిగలిగిన పిదప నడుగుదు. మీ కావ్వైన భరతునిఁ బిలిపింపవలయునా వలదాయని. ఇక్కడికార్యములొక్కటియు వానికిఁ దెలియకున్నవి. అడుగక జాబెట్లువ్రాయుదు?

దశ — (ఊరకుండును).

వసి — ఏమఱకీతనిఁ గాచియుండుదు. నేఁబోయివత్తును.

దశ — (లేచి) ఆచార్యా! ఏటికిఁ బోయెద విందురమ్ము.

వసి — ఏల రావలయు? నీవు చక్కఁగ మాటలాడుచున్నఁగదా?

దశ — మాటలాడకేమి?

వసి — ఊరక కలవరించుచున్నావే.

దశ — అయ్యో! ఈచింతాగ్ని కాల్ప నిద్రయేలేదే? కలవరమెక్కడిది?

వసి — ఒకమాటడిగెదను. సరియైన యుత్తరమిచ్చిన వచ్చెదను. భరతుఁడెందున్నాఁడు?

దశ — గిరివ్రజపురమున. ఇదేలడిగెదవు?

వసి — అయిన వచ్చెదను. (కూర్చుండి) భరతు నిటకురమ్మని జాబువ్రాయఁగోరి నిన్నడుగ వచ్చితి. ఏముత్తర మిచ్చెదవు?

దశ — అయ్యో! వలదడుగుమా! ఆదుష్కర్ముని మోమే చూడను.

వసి — అయ్యో! దశరథా! వాఁడొక్కపాపము నెఱుఁగఁడే. ఇట్లేల?

దశ — వాఁడెట్టి వాఁడైననేమి? ఎన్నితపములో యెన్ని యజ్ఞములో చేసి లోకైకవీరు డగు కుమారుఁ బడసితినే. అట్టివాని నను బాపెనే. బాలఘాతుకియే కిరాతకసంజాతయే, యట్టిదైక కన్నవాని ముఖముఁజూతునా? చూచినప్పుడే నాప్రాణముల బాసెద.

కౌస — నాథా! అయినదయినది. ఈకార్పణ్యమున నేమిప్రయోజనము? మనదుష్కాలమునకుఁ గైక కట్టిబుద్ధిపుట్టెఁగాక మొదటినుండి దానిగుణము తెలియనివారమా? దానిక్షమింపుము. అది కడుఁగటకట పడుచున్నది. ఎన్నిమాఱులో వచ్చియుండెను. దానిదుఃఖముఁ జూడఁజాల. ఇప్పుడే పిలువఁబంపెద. కరుణింపుమా.

దశ — అయ్యో! వలదు. వలదు. ఆపతిఘాతుకి నేఁ జూడను. కౌసల్యా! నేనింకను గొన్నిదినములు జీవించియుండఁ గోరిన నీపని వలదు.

కౌస—నాథా! నాథా!

దశ—(ఊరకుండును).

కౌస—మరల మూర్ఛగలిగెఁగదా?

దశ—రామా! రామా! ఇందేల పండుకొంటివి? (నోకొట్టి) పండుకొనుము. పండు. కొనుము. నిద్రపొమ్ము. అయ్యో! ఈపదునాల్గేండ్లరణ్యముల నెట్లుంటివి? అయ్యో! నీకాలు సేతులెట్లు కాయలు గాచియున్నవి. నిన్ను మరల నేఁ జూడననియెంచి యుంటిసుమా? నీముద్దుమోము మరలఁజూడలభించెఁగా! పండుకొనుము. లేవకుము. ఆకైక మిమ్ము నెంతబాధపెట్టెను. సీతా! ఏల నిలుచుకొనియున్నావు? కూర్చుండుము. లక్ష్మణా! కూర్చుండుము. తే నేచేయుదమా రామా నీపట్టాభిషేకము? నీవు పోయితివి. భరతుఁడుచచ్చెను. ఈపదునాల్గేండ్లు వసిష్ఠుఁడే రాజ్యమేలుచుండె. సీతా! ఈమధ్య నా నీవీకొడుకుం గనినది? తెమ్మామనుమని. (ఎత్తుకొని ముద్దాడి) ఆ కౌసల్యవాఁడా? ఎట్టి ముద్దుమనుమఁడు. రామునిపోలిక తీసికొనియుండ నున్నాఁడే. సీతా! ఈముద్దుమనుమని నరణ్యమునఁగంటివే నీకానుపెవ్వరు చేసిరి? ఉపచారము లెవ్వరు చేసిరి?

కౌస—సుమిత్రా! నా నాథుఁడీయజ్ఞానస్థితినైన, మనుమని ముద్దాడుచున్నాఁడే, ఈ భాగ్యమైన నాకు లేదే.

దశ—"అజ్ఞానస్థితి" ఏటికే? కౌసల్యా! చూడుమీమనుమఁడెంత ముద్దుగారుచున్నాఁడు. నీకేమిజాడ్యము ముద్దాడకున్నావు? అయ్యా! నీవేరేమి? ఆ కౌసల్యయు నీకిఁకను మాటలురావా?

కౌస- }
సుమి- } హా! దైవమా! హా! నాథా!

దశ—కౌసల్యా! ఇంతవఱకు నేనేమి మాటలాడితినో యెఱుఁగ. నా కాయాసము మిక్కిలిగానున్నది. నేఁబ్రతుకనుసుమా?

కౌస—హా! నాథా! అట్లేలమాటలాడెదు? నీకేమయినది!

దశ—కౌసల్యా! సుమిత్రా! నేనిదివఱకు మీకుఁ జెప్పని రహస్యఁ జెప్పెదను. నాకా యమురులతోడి యుద్ధమునకుఁ బోవకముందు ఘోరశాపముగలిగె. అదియింత వఱకు స్మరణకు రాదయ్యె.

కవిరాజవిరాజితము.

సరయువపొంతనొకానొక రాతిరి సామజబుద్ధి ధరాసురునా
శరమునఁ జంపితి దాని నెఱింగి వెసన్ దలిదండ్రులు చచ్చి దు
స్తరమగుపుత్రవియోగము గాంచి సుతాసుత యంచుఁ దపించుచుఁ దు
ర్మరణమునొందుమటంచు శపించిరి మానునె తాపసశాపమిలన్ ॥

కౌస — నాథా! నీకలవరపుమాటలలోనే నిన్ననే యీపాపవృత్తాంతము వింటిమి.

దశ — వింటిరా! ఆశాపఫలమనుభవింపక తీఱునా? ఇఁకఁ గొన్నిగడియలకే నాయంత్యమున్నట్లున్నది.

వసి — ఇట్లేలందువు? నీకంటెఁ గష్టములను భవించిన వారులేరా? ఇదిగో! కైకేయి వచ్చుచున్నది. ఊఱడిల్లుము.

[ప్ర: కైక — (దీనభావమున)].

కైక — హా! నాథా! నన్నేలయిట్లు నిరాదరణచేసెదవు? నేనెట్లు భరింపఁగలను.

దశ — హా! హా! కైకా! కైకా! అయ్యో! కుమారా! రామా! (మోహముద్రెచ్చి( నిన్నెట్టియిడుములపాలు చేసితిని. నీకుఁ బగదాయనైతి. మృత్యుదేవతకు వరము లిచ్చితి. నీపాలి యమకింకరుఁడనైతి.

స్రగ్ధర.

నాకేలాకక్కు నాయున్నతగుణమణికి యాననవ్యకందర్పుఁడయ్యో
కీకారణ్యంబులం జిక్కితివె తనయ నీకేమి చింతించినిన్నున్
బోకార్పంగంటినెంతో పొగిలితివికనేఁ బోయెద నిన్నుఁ జూడన్
కైకా నీకైకదా నాకలుషహృదుని నాకాము నిం గోలుపోతిన్

అయ్యో! ఇట్లవునని యెఱుఁగఁగదా? అక్కటకటా! నామరణమువేళ నాముద్దులాఁడు, నామోహపుఁబట్టి, నాకులభూషణుఁడు, నామన్మథమన్మథుఁడు, నావేలుపుమొదవు, నాపూర్ణచంద్రుఁడు, నావంశాభరణము, నాతరుణార్కుఁడు, నానోముఫలము, ననుగన్నతండ్రి, నాధనము, నానిధానము, నాశిఖరముఁ నాచూళికాభరణము, నాకమనీయాదర్శము, నాచింతామణి, నాదైవము, నాసుకృతవిశేషము, నాజీవరత్నము, నాయనుంగుపాపఁడు నాదండనుండుటకు నోఁచనైతిఁగదా? రామా!

సూర్యకుల కలశపారాంనిధిసోమా! నిన్నెంతలయించితి. ఎట్టినిష్ఠురాటవులకుఁబంచితి. ఎంతక్రూరకృత్యమొనరించితి. కుమారా! నీవీపురికి మరల వచ్చినపిదప నన్నుక్షమింపవలయు సుమా? అప్పుడు వేఁడికొనుటకు నేనుండఁగలవాఁడఁగాను. ఇప్పుడే బ్రతికియుండఁగనే విన్నవించెద. ఎట్టిక్రూరాత్ముఁడనైనను, నెట్టి భీకరశాత్రవుఁడనైనను. దండ్రినగుదుఁగదా? నిష్కారుణ్యముగ నిన్ను భయంకరాటవులకుఁ బంచి నిర్లజ్జను నాప్రాణలతకుఁ గుఠారమెత్తిన యీకిరాతకవిధవనే, నీవెగ్గులాడ నైతివే. ననుక్షమింపవా? శుద్ధుఁడనై, సత్యపాశాబద్ధుఁడనై వృధుఁడనైన నన్ను క్షమింపవా?

లయగ్రాహి.

మందమతినై మదనసుందరుని నాకొలపుఁ
జందురుని నందమగునందనుని నిన్నుఁ గ్
డెందమున నింతయునుఁ గొందలము లేక వను
లందు ధరణీధరములందు వసియింపన్
వందారఁగఁ బంచి వెఱగంది దిగులొంది బెడఁ
గొంది వడఁగంది మదిఁగుందితిఁ గుమారా
సుందరతఁ జిందునరవిందములఁ జందురుని
నిందుగను నీముఖ మిఁకెందుఁగను గొందున్ ॥

అయ్యో! ఏమిక్షమించి యేమిప్రయోజనము? నీముద్దుమోము మరలఁజూడఁజాలఁగదా? అక్కటా! నీవా పాడువిపినములకుఁబోవునాఁడు నాతోమాటలాడితివే, అదియే కడమాటాయెఁగా? నాకునమస్కరించితివే అదియె తుదనమస్కారమా? నన్నాశ్లేషించితివే అదియె యంత్యాశ్లేషమా? నీవురథమెక్కి పోవ వెనువదిలిచూచితివే యదియెకడచూపా? అక్కటా! ఎట్లుభరింతు.

సీ॥ వనికేగునాఁ డడుజ్జనకా యనుచుఁబిల్చి
తదియయో కడపిలుపాయె నాకు
ఆకైకయింట నిన్నాలింగనము సేయు
టదియయో కడసారియాయె నాకు
ఆనాఁడు నీవదనారవిందము చూచు
టదియయో కడచూపయాయె నాకు

అలనాఁడు నీవు నన్నడలకుమని యంటి
వదియయ్యో కడమాట యాయె నాకు
తే॥ గీ॥ ఎట్టు భరింతుఁ దరియింతు నిలజరింతు
నుసురు చాలింతుఁ బలవింతు నుమ్మలింతుఁ
గడఁగి వేగింతుఁ దుదఁగాంతుఁ గలవరింతుఁ
గృతము గణియింతు రఘురామ రిపువిరామ॥

ఆ సీతాస్వయంవరమునాఁడు లోకము వారందఱు నిను మెచ్చి మెచ్చి పొగడుచుండఁ గన్నానందముగ వింటినే. ఇట్టికీర్తివంతున కిట్టివంశభూషణునకుఁ బట్టము గట్టక నా రాజ్య మేలయని యెంచితినే. ఎంచియు మఱచితినే. మరణసూచకమగు దుస్స్వప్నము వచ్చి పఱకుఁ దలంపనైతినే. భరతుఁ డిందున్నప్పుడే యీస్వప్నము రాఁగూడదా? నావిధి వక్రింత చేసెను! అయ్యో! తాపసులే. శతవృద్ధులే. అట్టివారి యేకపుత్రుని నిరపరాధుని నా పాడుబాణమునఁ జంపితినే. నాకు నలుగురు కొడుకులుండియు వారిలో నొకని నరణ్యమునకుఁ బంపుటకే యిట్లు పరితపింతునే. ఆయేకపుత్రునిఁ గోల్పోయి యావృద్ధాంధ దంపతు లెంత నొచ్చిరో. ఎంత కటకటపడిరో. ఎంత తపించిరో. అటుంతప్తులైనవా రిచ్చిన శాపము నాకుఁ దప్పునా? నిర్దగ్ధము చేయదా?

క్రౌంచపదము.

దానవభీమా-తారకనామా-ధరణివరవినుతదశరథరామా
దీనసురాగా-ధీగుణయోగా-త్రిదశవరనుత విదితబహుభోగా
మానవవీరా-మారశరీరా-మురరిపుమహిధరమదపవిధారా
భానుసమతేజా-పాలితరాజా-బహువిధసుగుణయుత-వరితధరాజా॥

హా! సీతా! ఇందుఁగల సర్వైశ్వర్యములమాని నీపతివెంటఁ బోయితివిగా.

సుగంధి॥ ఈడులేనిసాధ్వి నీవహీనభంగి నీపతిన్
గూడి రాజ్యభోగ మొందఁ గోరియుంటిఁ గాదె యో
పాడుకాన నెట్లు నీ వపార దుఃఖ మొందెదో
కోడలా నినుం దలంపఁ గుందు మానదయ్యయో॥

రామా! భరతుఁ డట్లగుటఁ జూడకుము. వాఁడు నిరపరాధియ కానోపు. ఈ పాతకముచేయిద మీదుర్జాతిడ కాక వాఁడు పాపరహితుఁడుగా నుండనోపునువా. కానిక్షమింపుము.

## అనుబంధము 36

రామా! రామా! రామా! (చచ్చును).

కౌస—నాథా! రాముఁడు నీకుఁ జెప్పడా మమ్మూఱడింపుమని? ఇదియా యూఱడించుటయా! ఏలమాట్లాడవు? (చూచి) హా! నాథా! (పడును)

సుమి— } (చూచి) హా! ప్రాణేశా!
కైక— } (పైఁబడుదురు)

వసి—ఏమి! ఏమి! ఏమి!

కౌస—ఇంకేమి? నిర్దయస్వాంతుఁడై మాపతి మముఁ బాసిపోయె.

వసి—హా హా హా హా హా! హరి హరీ! (లోనికిఁబోవును).

## అనుబంధము 37

కౌస—నాథా! మమ్మునిట్లనాథలఁ జేసిపోయితివే. మాపైనింత కరుణఁ గలుగదయ్యెనే. ప్రాణేశా! మేమెందుఁ జేరువారము! మమ్మెవ్వరుమాటాడించెదరు? రాముఁడు నాకు లేకపోయినను, నీకు శుశ్రూషచేసి కాలము గడపెదనని యెంచియుంటినే. ఆపుణ్యము నాకు లేదయ్యెనే. ప్రాణకాంతా! "రామా! రమ్ము కూర్చుండుము. పండుకొనుము". అని కలవరించుచు నైన నింకఁ గొన్నియేండ్లుండవైతివే. నీవు కొంతదుఃఖమనుభవించి కన్నులుమూసితివి. మాకుఁగదా పడరాని పాట్లుగలిగె! నీవు సత్యసంధుఁడవని ప్రతిజ్ఞ నెఱపి జగములఁ గీర్తిగంటివి. రాముఁడు జనకునాజ్ఞ నెఱవేర్చిన కీర్తిఁగనియె. దుష్ఫలములన్నియు మాకుఁగలిగించితివి. అయ్యో! సత్యమునకై కొడుకునంగానలకంపితివి. సత్యమునకై మరణముఁ దెచ్చుకొంటివి. సత్యమా! సత్యమా! హా! నాథా! (మూర్ఛిల్లును)

## అనుబంధము 38

కైక—హా! నాథా! ఇట్లవునని కలనైన నెంచనైతినే. ఏమిప్రాప్తిఁ దెచ్చికొంటిని. ప్రాణేశా! ననుఁ గన్నెత్తిచూడుము. నాకువరములు వలదు. ఇంకనడుగను. ఏవరములును వలదు. రామునిఁ బిలువఁబంపుము.

కౌస—కైకా! మావలె నీవేలయేడ్చెదవమ్మా సంతోషింపక? నీకొడుకునకుఁ బట్టము గోరికదా యింతకార్యముఁ జేసితివి? నీయపరాధమునకు ఫలము నీతోడ మమ్ము విధవలఁజేసితివే. అమ్మా! నీకేమికొఱంత. కొడుకున్నాఁడు. చక్రవర్తియయ్యెడు. నాకుఁ గొడుకులేడే. నానాథుండు పోయెనే. హా! నాథా! నాథా!

సుమి—ప్రాణేశా! ననుఁజూచినప్పుడంతయు నాకు సుమిత్రనామము కడుసార్థకమనుచుంటివే. "సుమిత్రా" యని నన్నెవ్వరింకఁ బిలుచువారు? కైకా! ఇంక సర్వసుఖము లనుభవింపుము. నేనేమి తప్పొనర్చితినే? నన్ననాథఁగాఁ జేసితివి.

వసి—(వచ్చి) రాజదేవులారా! ఇంకేమి ప్రయోజనము? మీరెంతశోకించినను దశరథుఁడు రాఁగలఁడా? ఊఱడిల్లుఁడు.

కౌస—అయ్యో! మాదశరథుఁడింకెక్కడనున్నాఁడు. ప్రాణేశా! నీముద్దుకుమారుఁడు రాముఁడరుదెంచినాఁడు. చూడుమా.

వసి—చూచి భరింపఁజాలను.

అనుబంధము 39

## తృతీయాంకము సమాప్తము.



*

శ్రీ

# పాదుకాపట్టాభిషేకము.

## చతుర్థాఙ్కము-ప్రథమరంగము.

### బాట (దారి).

[ప్ర: భరతుఁడు, శత్రుఘ్నుఁడు (రథముపైన)]

భర — శత్రుఘ్నా ! రథమింత నిలుపుము.

అనుబంధము 40

ఇదె యయోధ్య క్రోశమాత్రమున్నది. ఊరుదాఁపునకువచ్చినది. కడుపునఁజేయివెట్టి కలఁచినట్లయ్యెడు. గుండెదిగులయ్యెడు. మరలనైన నీజాబుల యర్థమాలోచింతము

శత్రు — ఇన్నిమారులు చదివితిమే —

భర — ఐననేమాయె ? మరలఁజూతము. ఏమయినఁ దెలియునేమో. (జాబులుదీసి) ఈజాబు మాయయ్య యీచైత్ర శుద్ధ చతుర్థి వ్రాసినాఁడు. నాకు నష్టమినాఁడు ముట్టినది. ఇందేమియు విశేషములులేవు. ఆకస్మికముగా రాముని పట్టాభిషేక మహోత్సవము తలపెట్టినట్లును, నిందులకు దుస్స్వప్నము కారణమనియు వ్రాసినాడు నేను లేకుండుటకు మిక్కిలి చింతిల్లియు శుభదినములు లేనందున విధిలేక పంచమి నాఁడే మహోత్సవము నెఱవేర్చుదు మని వ్రాసినాఁడు. దీననేమున్నది ? ఈ మంథరయు, వసిష్ఠుఁడును వ్రాసినజాబులే యవిదితార్థములు గనున్నవి. మన తండ్రి వ్రాసిన జాబు నాకుముట్టిన యష్టమినాఁడే మంథరజాబును ముట్టెగదా ? అయిన నది దానిచే బంచమినాఁడు వ్రాయఁబడినది. దీనిమరలఁ బర్యాలోచింతము. (చదువును)

"చేయు విజ్ఞప్తులు. ఇందు విశేషోదంతములు మెండుగాజరిగినవి. పూర్ణఫలితార్థము తెలిసికొనక వానినన్నిటి మీకునివేదించుట యనావశ్యకమని మానితి. అవి మీకు మిక్కిలి సంతోషావహములగుటచే ముమ్మొదట మీకీజాబుమాత్రము వ్రాసితి. ఎట్టి సంతోషమైనను, స్వల్పదుఃఖముతోఁ జేరననే యానందజనకము. బుద్ధిశాలు రాదుఃఖమును మఱచి సంతోషమునే గ్రహింతురు. మీరు సుధీశాలురేకదా ? మీసంతోషమునకు నేనేకారణభూతనాటచే నేనే ముందీజాబువ్రాసి యున్నాను. మీరిప్పుడేమి యుఁద్వరపడి రావలసిన యవశ్యకములేదు. ఎంత యాలస్యముచేసిన నంతమేలు. కార్యసాధకమునునగు. ఇట్లు. మంథర"

ఇంతయైనను దీనియర్థము తెలియదుగదా? సంతోషమేమో, చింతయేమో తెలియకున్నది. నాఁటినుండి వృత్తాంతమే తెలియక పరితపింప శుద్ధ త్రయోదశి నాఁడు వసిష్ఠుఁడు వ్రాసినజాబు మొన్న పూర్ణిమనాఁడు ముట్టెనుగదా? దానిఁదిలకింతము. “రామపట్టాభిషేకము నిల్చియున్నది. ఈజాబందినతోడనే యతిశీఘ్రముగ నీవురావలయు. మనోవేగమున నీవువచ్చినను, నింకను నాలస్యమేయగు. ఇందు జరిగియుండు సందర్భము లెన్ని గ్రంథములు వ్రాసినను దీఱవు. అవి క్షేమవార్తలనుటకును, దుఃఖవార్తలనుటకును, నీచేనున్నది. ఈజాబు తెచ్చినవారి నేవృత్తాంతము నీవడుగ వలదు. నీవేమడిగినను మూకభావము వహించియుండ వలయునని వీరికి గట్టికట్టడయొనర్పఁబడినది. నీవిందు వచ్చువఱకు నిక్కడియుదంతములు నీకుఁ దెలియ గూడదనియుఁ దెలిసినను బ్రయోజనములు కావనియు నిర్ణయమొనర్పఁబడియున్నది. ఈజాబుచేరిన మూఁడవనాఁడు, తుదకు నాల్గవనాఁడు, నీవయోధ్యకుఁ జేరకున్న నీవు దశరథునిఁ జూతువనుట నిష్ఫలము. ఇది గురువు నాజ్ఞగా భావింపుము”

ఇందు శ్రీకారముగాని కుశలోదంతముగాని తుదకాశీర్వాదముగానియైన వ్రాయలేదు. ఏమందును?

శత్రు — భరతా? ఎన్నిమాఱులో చదివితివి. ఏమైన దెలిసెనా? ఇదేయూరు సమీపించె. పోయిన నన్నియు విశదములగుఁగదా?

భర — శత్రుఘ్నా! ఎట్టియుత్పాతములు జరిగియున్నవియో తెలియకున్నదిగదా? మాజనకుని పాదములకు నమస్కరించి యతని గౌఁగిలింతను వడయువఱకు, శ్రీరాముని చరణములకెఱఁగియతని దీవనలు వడయువఱకు, లక్ష్మణుని సౌఖ్యోదంతమువినువఱకు నాకూఱట కలుగదుగా? శత్రుఘ్నా! చూచితివే యీపురము పాడూరివలెనున్నది. ఈపౌరులఁగంటివే. నన్నుఁజూచి కన్నీరునించి మోములావలఁ ద్రిప్పుకొని పోవుచున్నారు. నన్నిట్లేల దాచెదరు. నాకుఁ గళవళ మగుచున్నదిసుమా. ఈసంతాపమునకుఁ గారణము దశరథుఁడో రాముఁడో మఱియెవ్వరో యెఱుఁగఁగదా?

మ॥ పురివారల్ నన్ గాంచి కన్నులను వాఃపూరంబు నిండంగ సో
దరయూవైపున మోముఁద్రిప్పి చనుచుందు రూహాచేయఁగందు
స్తనమాతండ్రియొ రాముఁడో జననులో సౌమిత్రియో సీతయో
పరితాపంబునకుం గతంబు మఱియెవ్వారో యెఱుంగంగదే॥

మ॥ వికచాబ్జాభము భాసుణీసు ముఖముల్ వీక్షింపఁగాఁగల్గునో
సుకృతోదంచితసాధ్వులన్ జననులన్ జూడంగనున్నాఁడనో
యకలంకంబగు రాము మోముఁ గనుభాగ్యంబున్నదే యెట్టులో
నాకా వీనుంగవ నెట్టి వార్తవినఁగానున్నాఁడనో సోదరా॥

అనియేల నసుమోమలరి లక్ష్మణుండు నాకెదురు రాకున్నాఁడు? రథమింక నిలుపుము. వెనుకకుఁబోదము. క్షేమోదంతములన్నియుఁ దెలిసి మఱలివత్తము.

శత్రు—ఇట్లుదిగ్గ్లపడి ప్రయోజనమేమి? కైకేయి మాతయిల్లే సమీపమునున్నది. అయోధ్యకే పోవుదమా?

భర—ఒక్కనిమిషమైనను బోనిమ్ము. కన్నులు చెవులు మూసికొనియుండెద. "క్షేమ" మను వార్త నీనోట వచ్చువఱకు నిట్లే యుండెద. అయ్యో! నాపాడుచెవులీనాఁ డెట్టి వార్త వినవున్నవో కదా?

శత్రు—చిత్తము. కైకేయి మాతయింటికే రథము పోవనిచ్చెదను.

(నిష్క్రమింతురు).

## చతుర్థాజ్కము-ద్వితీయరంగము.

### కైకేయి యిల్లు.

[ప్ర: కైకేయి (దుఃఖమున)—మంథర.]

మంథర—కైకా! దుఃఖింపకుము. ఏమి చేసినను దశరథుని బడయఁగలవా? వయసు చెల్లినవారిఁ బెండ్లియాడిన కాంతలకంతయు రాఁదగిన గతియే నీకుఁగలిగెను. నీవేమి లోకమున కరుదా?

కైక—మంథరా! నీ దుశ్చరితముగదా నన్నీగతికిఁదెచ్చెను. నేనిందఱివలె సౌఖ్యమగనే యుంటినే.

**అనుబాధము 41**

సీ॥ కలకాముపక్తిఁ గలిగించు నత్యంత
కలుషకృత్యం బాచుఁదలఁపనైతి
పోకార్పవిపినాళి లోకైకవీరుఁడౌ
సుకుమారుఁడే యంచుఁ జూడనైతి
పాపంబుఁ దలపోయు కాపాడు వరముల
కిది ఫలంబగునంచు నెన్ననైతి
నాథుండు పవతులం నాకాళ్లఁబడి వేఁడ
నార్ద్రమానసమింత యరయనైతి
తే॥గీ॥ నవరయుఁ వసతులందున నత్యధమనైతి
ధవునిపాలిటి కే బగదాయనైతి
విపులసంకటములఁగుందు విధవనైతి
మంథరా లోకనింద్యనై మసఁగనైతి॥

మంథ—నీకు వ్యసనము వేళ గనుక నీవేమన్న నూరకుందును. ఓసమ్మా! నా దుశ్చరిత్రమున నే నీవు చక్రవర్తిమాతవైనది. నా దుశ్చరితము వలన నీకేమి కొఱ్ఱలైనదే? నీపతి యింకఁ గొన్ని దినములకైనఁ జచ్చియుండఁడో? రాముఁడాసుఁడై యుండఁదగని పట్టి చక్రవర్తియవుటయుఁ, గొన్నిదినములకైనఁ జావనున్న నీపతి యిప్పుడే చచ్చుటయు సరిపోల్చి శుభముగాఁ జేయుము. ఏదియెక్కువగునో? అదియొప్పిపతియే?

నిను మెచ్చి వరములిచ్చి నీకు స్వతంత్రముగల వరములడిగిన మాత్రముననే, తాఁజచ్చుట వలనను నీ ముఖమయిననుఁ జూడనిపతి యేటిపతియే కేశపతి? అతఁడుండి యేమిసుఖ మనుభవింపనుంటివి? నేను ఖండితవాదినిగానఁ గనలకుము. అతఁడు పోయినదే యిప్పుడు భరతునికి క్షేమము. తండ్రియుండిన భరతుఁడు రాజ్యమేల నొప్పుకొను చుండెనో లేదో? ఇప్పుడు నిరాటకము. ఇప్పుడో యింకొక్క క్షణమునకో భరతుఁడు రానున్నాఁడు. వానియెదుట నీవిట్లు చింతతో నేడ్చుచుండిన నేమనుకొనును. ఇది యెవ్వరిబోధనయో పాపిని యిట్లు చేసియుండునని యనుకొనఁడా? నీవింత చేసి, సవ తులవలనఁ దిట్లుబడి కన్నుండలతో నసుఁద్దిట్టించి పతినిఁ బోవఁగొట్టుకొని యుం డఁటీవలనఁ దిట్టుపడుటకా నీవిట్లొనర్చుట? వండి తపిలదించి యాపన నుంచుకొని యనుపానము గలిపి కబళముఁ జేతఁబట్టుకొని నోటికిఁ గొనిపోవునప్పుడు నేలఁబాఱ వేయఁజూచెదవే. అదిగో! రథధ్వానము. భరతుఁడే వచ్చెఁగాఁబోలు. దుఃఖము మానుము. మందహాసముఁ దెచ్చికొనుము. కార్యము సాధింపుము.

[ప్రవేశము: భరతుఁడు శత్రుఘ్నుఁడు.]

భ—<br>శత్రు } (కైకకు నమస్కరించెదరు)

కై—(మందహాసమున) అన్నా! భరతా! లెమ్ము.

భర—మాతా! ఊరంతయుఁ బాడువడియున్నది. ఎట్టివిశేషములుగలిగె? జనకునకు క్షేమమా? తల్లులకందఱికి సౌఖ్యమా? సీతారాములకుఁ బ్రమోదమా? లక్ష్మణునకుఁ గుశలమా? ప్రజలకంతయు నానందమా? రామపట్టాభిషేకమేలనిల్చెను? నీముఖమేటికి స్మితసహితమయ్యె వంతమానదు?

### భుజంగప్రయాతము.

క్షమాధీశుఁడమ్మా సుఖంబున్నవాఁడే
సుమిత్రాదిమాత ల్విశుద్ధల్శుభంబే
ప్రమోదంబె రాముండు రామానుజుండున్
సమాఖ్యాతయా సీత సౌఖ్యంబెమాతా ॥

కైక—కుమారా! ఈదశరథుఁడు ననుమోసముచేసి నిన్ను వచించి నిన్ను గిరివ్రజపుర మునకుఁబంపి రాముని పట్టాభిషిక్తుఁజేయ నెంచెను. అల దేవాసురుల యుద్ధమునాఁడు అతఁడు నాకు రెండువరముల నిచ్చియుండె. ఇప్పుడు వానినడిగితి. ఒకటికి నీకుఁ

బట్టముగోరితి. మఱియొకటికి రాముఁడాపసవృత్తిం బదునాలుగేండ్లరణ్యమున నుండ వేఁడితి. సీతాలక్ష్మణులతో రాముఁడరణ్యమునకుఁబోయె. ఇప్పటి కేడుదినముల క్రిందట దశరథుఁడు మాత్రము కాలధర్మమునొందెను.

భర—
శత్రు } హా! పతిఘాతుకీ! పుత్రఘాతుకీ! (మూర్ఛిల్లుదురు)

మంథ—(తొంగిచూచుచుండును).

భర—(లేచి) హా! పుత్రఘాతుకీ! నీవేలపుట్టితివి? నాకేలతల్లివైతివి? సుకుమారుఁడైన రామునీవడవుల నుండఁగోర నీనోరెట్లాడెను? అక్కటా! నీవు కేకయరాజునకు జనించినదానా, కటికరాక్షసునకు నీతల్లి నినుఁగనియుండవలెఁగాక? ఇట్టిద్రోహబుద్ధి నీకుండునా? ఏమిపనియే? ముగ్ధుసుమారుని, నాకులస్వామిని, నాదేవదేవుని, నడవులకుఁబంపి పతినిఁ జంపికొంటివే? దశరథునపాలిటి మృత్యుదేవతవైతి. ఇట్టిక్రూర కృత్యమొనరించి చిఱునవ్వుదెచ్చుకొని నాతో మాటలాడనోపితివా? నీవుఁ గొడుక నవుటచే దుర్జాతుఁడనైతి. అపకీర్తిపాలైతిని. కటకటా! ఆరామునిఁబాసి నేనురాజ్యమునకు సమ్మతింతునని నమ్మితివా? నీకు జనించినమాత్రననే నీయట్టి క్రూరగుణములు నాకుండునని యెంచితివా? వాని పాదసేవలేని సురరాజ్యమైన నేనాసింతునా? నాజనకునిఁ జంపఁగలదానవని యెక్కడనైన విన్నయెఱుఁగఁగదా? అయ్యయ్యో! తల్లిబిడ్డలకుఁ, దండ్రికొమాళ్లకు, నన్నదమ్ముల కెడవుచేసితివిగదే? అక్కటా! ఆజనకుఁడు నన్నెంత తిట్టుకొనుచుఁ బ్రాణములఁ బాసెనో? ఆరామునికి నామైనెంత విసుగుగలిగెనో? లక్ష్మణుఁడెంత కట్లోగ్నెనో. ఆపతివ్రతాతిలకము, కౌసల్యకు నెమ్మోమెట్లుచూపుదు? అయ్యో! ఈజన్మమేటికి? శ్రీహరీ!

శత్రు—భరతా! ఇదిగదా యంతఁ గారణము? ఇప్పుడుం దెలిసెనా? ఇది నీనుదుటు వ్రాసినలక్షణ మిప్పుడైన నెఱుఁగనయ్యెనా? అది సంతోషమఁట! ఇదిస్వల్ప దుఃఖమఁట! స్వల్పదుఃఖము వృత్తాంతము విదితమాయెఁగదా. ఈపలుగాకి, ఈ బాలఘాతుకి, ఈజగజంత, దుర్జాతి! చావుము. (మంథరను బడవేసి కుత్తుక ద్రొక్కును).

మంథ—అయ్యో! అయ్యో! చచ్చితి. చచ్చితి!

శత్రు—(కత్తిపట్టి) ఈదురాత్మురాలినిపుడ—(ఖండింపఁబోవును).

భర—(నిలిపి) శత్రుఘ్నా! ఈకులద్వేషిణిఁ జంపినపాపము మనకేల? ఎట్టిద్రోహమానసయైనను మనతల్లియిదియను మహాపయశము మనకుఁ గలదుగా? ఇదిపతి పుత్రఘాతుకియైనను మనము మాతృఘాతుకులేల కావలయు? మనమిట్లు చేసిన

మిత్ర రాముఁడు ద్రోహులనఁడా? ఆదరించునా? దీనిఁజంపుట రామునికి హితమైన లక్ష్మణుఁడు చంపకుండునని యోచితివా? ఈదుర్గాతిని ధర చావనైయున్నది. ఇట్లొప్పనందులకె రాముఁడు మఱి నేమనునో?

కైక — హా! దైవమా! (నిష్క్ర)

## అనుబంధము 42

భర — శత్రుఘ్నా! తరంగతరంగములుగా దుఃఖము గలుగుచున్నదే. హా! జనకా!
(మూర్ఛిల్లును) (యవనిక పడును)

## చతుర్థాంకము-తృతీయరంగము.

### భరతునిల్లు.

[ప్ర: భరతుడు జాబుచేఁబట్టి]

## అనుబంధము 43

సీ॥ మా రాఘవుఁడు లేమి మసనమైతోఁచు నీ
పాడూరుగన్నత్తి చూడఁగలనె
తలయెత్తరాని నిందలమోచిదుష్కీర్తి
నవనిపైనీకఁ దిరుగాడఁగలనె
కనినయంతనె లోనఁ గటికిశోకమునించు
కైకేయివదనంబుఁ గాంచఁగలనె
పడరానిబన్నముల్ పడినకౌసల్యకీ
పాపపుమోమింకఁజూపఁగలనె

తే. గీ॥ రాముపదసేవమాని నేఁబ్రదుకఁగలనె
వెలయ భూజాతఁ గనక జీవింపఁగలనె
యనుజులక్ష్మణు నెడఁబాసిమనఁగఁగలనె
కటకటా శోకజలరాశిఁ గడవఁగలనె ॥

హా! దుఃఖము! శ్రీరామునింకెన్నఁడుచూతును? అతఁడు నన్నెట్లు క్షమించును? కరుణింపకున్న నను పులకరింపఁగలనా? అయ్యో! నేనెంత ప్రార్థించినను, జనకాజ్ఞ పాలింప కతఁడు పురికివచ్చునా? అతఁడు రాకున్న నేనిందుండఁగలనా? అరాజుఁడు

అర్థిజనసురారాముఁడు, పాదచారియై యరణ్యములనుండ నేఁజతురంతయానములఁ బురమునఁ దిరుగాడుదునా? అతఁడు కందమూలఫలాహారుఁడై యుండ నే భక్ష్యభోజ్యములఁ స్వీకరింతునా? అతఁడు ధరాతలశయనుఁడై యుండ నేఁ బాన్పులపై శయనింతునా అతఁడు పర్ణశాలావాసుఁడై యుండ నే సౌధాంతరములనుందునా? అయ్యో! ఎట్టికఠినమానసకే జనించితి? కటాక్షమాత్రమున ముల్లోకములఁ గలఁపఁజాలు తమ్మునితోఁ జంద్రకాయతసుందర మందస్మితమాత్రమున నిట్టికైకఁబోలువారిఁ బనిసేవుర దాసీజనములుగా నొనర్చు యేలఁజాలు ప్రియకాంతతోఁ గట్టెకుటునిల్చి వనమున కనుజ్ఞయయుగ నీదుష్కృతినమానసము మెట్లైనపదయ్యెఁగా! నేనేకైకకేలజనించితి? కౌసల్యకైనను బుట్టనైతినే. ఊరక కఠన్యాయములకుఁ బోవుచుంటినే. అయ్యో! ఇట్టినిర్భాగ్యన కట్లేలయగు? జగదేకమాన్య సుగుణసాకల్యయగు కౌసల్యకు నాయట్టి కలుషాత్ముఁడు జనించునా? జనలోకాపనుఁడై, పూతచరిత్రుఁడైన రాముఁడీ కులతరులవిత్రకు నపయశఃపాత్రకు, నీచకు కాక కైకకు జనించునా? అయ్యో! ఈకైక యెందతికైనఁ జెడుగొంచి నాయెక్కుని మేలుకోఁజాలనికదా యిట్టిదుష్కృత్యమొనర్చె? ఇదెట్టి విపరీతఫలము గలిగించె! దశరథుఁడన్న నెంతదుఃఖమైనను నాల్గుదినములనుభవించి కన్నులుమూసె. కౌసల్యయో పతివియోగమునకును బుత్రవియోగమునకును, నిప్పుడు దుఃఖించినను బదునాల్గేండ్ల పిదపనైన సుఖములనుభవింపఁగలదు. సుమిత్రయునట్టిదేయగు. రాముఁడన్న సతితోఁ దమ్మునితోఁ బదునాల్గేండ్లు సౌఖ్యములేకుండినఁబిదప గాఁగలఁడు ఇందలికష్టములాకట్టియు నెఱుఁగక సౌఖ్యముగ నున్నాఁడు. లక్ష్మణునకన్న, ఆయన్న పాదపద్మములు గొలిచియుండుటకంటె సౌఖ్యమేమున్నది? సీతాదేవియో, పతియందు బద్ధానురాగయై తదేక శేషిత్వ భావమునఁ గలిసియుండుటఁ జీవితమేమి? నాసంగతిగదా పరమసంతాపకరము. కన్నతల్లిశత్రువాయెను. పెద్దతల్లులకును, సీతారామలక్ష్మణులకును నేఁ బగవాఁడనైతిని. అయ్యో! ఎక్కడిపగవాఁడ. పగతుఁడనైనను దనశత్రువును దపసివేషమున నరణ్యములనుండుమని కోరునే! కటికిచండాలుఁడుఁగదా? తండ్రియో నన్నుఁ గలుషాత్ముఁడని యెంచి యట్టిమానసమునసే నను జూడక మాటాడక మనవి వినక మృతిఁబొందే. అతనిఁ బోవఁగొట్టికొంటి. చచ్చినపుడును దండనుండనైతి. అతని చావుచూచినది చాలక, హృదయము కుమిలించు నతని యుత్తరక్రియలు సేవచేయఁ బాల్పడితి. కటకటా! జనకా! నిను నాకెవ్వరిచ్చువారు? ఈదుఃఖాంబుధి నేగతిఁ దరియింతు. తలయెత్తుకొని యింకే భంగిఁ జరియింతు? సంతాపము నెక్కడ వీడి భరియింతు! నాప్రాణానిలములనే మాడ్కి హరియింతు? కౌసల్యకు మోమెట్లుచూపుదు. నాప్రాణానిలముల నిప్పుడే పోకార్చువారుగలుగరా సంహారనౌషధము లేభిషగ్వర్యులైన నాకీరా? మారణమంత్రముల నేమంత్రవాదులైన నాపైఁబ్రయోగింపరా! హా! నిష్ఠురము. రామా! రామా! కైకా! కౌసల్యా! జనకా! (మూర్ఛిల్లును).

## తురీయరంగము-కౌసల్యనగరు.

[ప్ర: కౌసల్య (దుఃఖించుచుమూర్ఛిల్లి),]

---

### భరత-శత్రుఘ్న-వసిష్ఠులు (ప్రవేశన).

భర—సంయమీంద్రా! నాచేతఁగాదు. ఇన్ని సంకటములకోర్చితిని. ఇదిశక్తికి మీఱి యున్నది. నేనామెను ముఖముజూపఁజాల.

వసి—భరతా! ఇట్లయిన నెక్కడికిఁబోదము. ఊరకరమ్ము. శత్రుఘ్నునకుఁ దెలిసినంత నీకుఁదెలియదా?

భర—ఋషితిలకా! శత్రుఘ్నునివలె నేఁగానైతినే. సుమిత్రాత్మజుఁడను కైకగర్భము నుండి వెల్వడిన కాలసర్పమనైతినే.

### అనుబంధము 44

కౌస—నాథా! రాముపట్టాభిషేకము నీవు చూడనోపవన్నను, కైకకిచ్చిన వరమునకై భరతు పట్టాభిషేకమైన నీవు చూడవైతివే.

వసి—రమ్ము. రాకున్న నెట్లుతప్పును? (ఈడ్చుచు)

భర—(ముందఱికివచ్చి) తల్లీ! ఏమహాపాతకములు లోకకంటకములై యాచంద్రార్క మపకీర్తిఁగానెనో, ఏమహాదుష్కలుషాక్షరముల ధరించిన నిర్భాగ్యుని సంతానమైన భోగుని గనుటచేఁ గైకగర్భము ఘోరవ్యాళములను మనికిపట్టగు గుహాముఖమును, గాలభుజంగి సమాశ్రయమగు ఘోరవల్మీకమును బోలెనో, ఏమహాపాపాక్షరముల వానివలన నీవును, సుమిత్రయును రామచంద్రుఁడును బహుగాని పొల్లుగలిగెనో, ఏమహాపాతకముల యర్థము పితృభ్రాతృఘాతుకమని జగముల నెఱిఁగెనో, ఆదుష్టాక్షరముల భ-ర-త నామము వహించిన క్రూరకర్ముఁడను వీఁడే. అమ్మా! వలసిన శాప మొసఁగుము. తెగడుము. దయచూపకుము.

### అనుబంధము 45

కౌస—అయ్యా! భరతచక్రవర్తీ! కొడుకును గోడలిని ఘోరారణ్యములకనుపి మగనిఁ బొట్టఁబెట్టుకొని గత్యంతరముఁ గానకున్న మేమేవ్వరలయుఁగాక, నీయిష్టానుసారమున గావలసిన వరములడుగఁ గైకయుండ, నీకోరిన సార్వభౌమపద మబ్బియుండ నీకేల శోకము?

భర — అమ్మా ! కౌసల్యాదేవీ ! రామలక్ష్మణులఁబాసి దశరథుఁ లేకుండఁ జేసికొని యపకీర్తిపాలై తలయెత్తనోపకుండుటంబడిపోవ ననియాడుచున్న నాప్రాణములనిప్పుడే తీసితివి. అయినను. నివి యెంతతీఁపులో పాయనేరకున్నాను. అమ్మగో ! రాముఁడు కరుణింపకున్నను, లక్ష్మణుఁడు కనలినను, దశరథుఁడు నను దప్పఁదలఁచినను, నాగుణము నీవు గుర్తెఱుఁగుదువుగదాయని నమ్మితి. దైవమున కింతకఠిన్యైనను రాదాయెఁగా ? అమ్మా ! నిక్కమాడెదను. నీచరణములాన వచించెదను. ఈభూమ్యాకాశములు, దివ్యవాణియుఁ, బంచభూతములు, సూర్యచంద్రులింకులకు సాక్షులౌదురుగాక ! తల్లిగో ! ఈకైక మానసఘూక వ్యాళపాకయొనర్చిన పాపము నేగిరివ్రజపురమున నుండునప్పుడైన, 'అందుండ నిపుడు పైనున్న మాజనకుఁడీ జాబు వ్రాసినప్పుడైన, నిపుడువచ్చుపోవు ప్రాణముతోఁ దనకులాడుచు జచ్చియుఁజావక యున్న యీకలుషములకు మూలకందమగు దుర్జాతిమంధర యీజాబు నాకువ్రాసినప్పుడైన, నాలుగు దినములక్రిందట మాతండ్రి పరలోకముచేరిన వృత్తాంతము సయితము నాకుఁదెలుపక యీవసిష్టమునీంద్రుఁడీ కమ్మ పంపినప్పుడైనఁ, బుద్ధిమంతయు వెలవెలఁబోయి మసనంబు కగణీధూమధామమైయుండిన చందము నేఁజూచినప్పుడైనకి నీపౌరు లొక్కరొక్కరు నామోముఁ జూచి చూచి కన్నీరునించి నించి విసికి విసి, పెనమోముల నావలఁబోయినప్పుడైన, శత్రుఘ్నుఁడు గధకుదోల నే నేతెంచి దశరథ రాజన్యుని రామునికనమాట వినఁజేసిన పాపపునెలవగు కైకయులు సొచ్చినప్పుడైన, నిన్ని యిడుములఁ గలిగించి పతినిజంపియు భయంకర స్మరగమునహించిన యీపాపిని పాదములకు నే నమస్కరించినప్పుడైన, నాకుఁ దెలిసియుండెనా, పంచమహాపాపులును, బ్రహ్మహింసకులు, మాతృహింసకులు, గన్యావిక్రయకులు పోవుపాపములకుఁ బోవువాఁడ. ఇదికల్లయైన, నాకు నరకప్రాప్తి గలుగుఁగాక ! నాకుఁగూతు పుట్టుకుంటుఁగాక ! నానోటఁబురువులుపడి పుచ్చిపోవుఁగాక ! శరీరమునఁ గుష్ఠువుగలిగి నాసంధిబంధము లన్నియు వ్రీలఁబడిపోవుఁగాక ! అంధత్వమును, బాధిర్యమును నాకొక్కసారియే కలిగి విచారించువారులేక, యసవుల మన్నదిని దిక్కులేక మృతిఁబొంది నాశవముదహించువారైనలేక గ్రద్దలపాలగుఁగాక ! జననీ ! అమేయ మహిమోపేతుఁడై మానులమున వెనుకటివారికిఁ, నున్నవారికి, బుట్టునున్నవారికి శిఖగోపకుఁడై నిజయశస్సుధాధవళితదిగంతుఁడై, పరసతీసోదరుఁడై. సుగుణఖనియై, తమ్ములనన్నఁ బుత్రులకంటె నెక్కువగా నెవఁడుచూచునో, యెవఁడు గలుగుటఁజేసి కౌసల్యయను పేరు సకలవీరసూసందోహములకు మాతృకయగునో, యెవని యుద్భవము సజ్జనహింసకులును, యజ్ఞయాగధ్వంసకులును నగురాక్షసదివాంధ సందోహమునకు సూర్యోదయమో, యెవ్వనియపాంగము సజ్జనమానస

చకోరములకుఁ జంద్రికయో, యెవ్వాని యీ విపురందరనందనమందార సందోహములఁ దలలు వంచెడినో, యెవ్వాని ప్రతాపము ప్రభాకరానల పద్మరాగ ప్రభలఁ బరిహసించెనో, యెవ్వని భ్రుకుటి ధారుణీవరవిదారిభూరికార్ముక ధాంగనైన, ముకుళిత హస్తుఁ జేసెనో, యట్టి యాచకకల్పకధామునకా, సుందరతనుప్రభాకామునకా, సుగ్రీవప్రథనభీమునకా, తరణికులాంభోనిధిసోమునకా, ఘనాయుతకుంజరస్థైమునకా, విచారితసర్వప్రకృతిజనక్షేమునకా, భ్రుకుటిమాత్రనిర్జిత పరశ్వధరామునకా, భూసురదత్తగోమహీశరాగ్రామునకా, మహాసుర నికారణభీమ సంగ్రామునకా, నీలమేఘశ్యామునకా, జానకీకామునకా, రామునకా, నేనెగ్గు దలంచుట? అమ్మరో! నీవు శపింతువని భయమొందను. ఈప్రాణములఁ దృణప్రాయముగ నెంచెద. ఆపురందరపదవి నైన నణుమాత్రముగ నుపేక్షించెద. నేనిటు చెప్పికొనుట భయమువలనఁ గాదు. నీకుఁ బ్రియమునకుఁ గాను. మోస మొనర్చుటకుఁ గాదు. ఇచ్చకమునకుఁ గాదు. నీయట్టి సాధ్వీమతల్లి నిరపరాధనైన నన్ను సంశయించె నేయని పాపమున కోర్వలేమి వచించితి. ఇంక వలసిన శాపమొసంగుము. భరించెద.

[ప్రవేశము: కైక (యొకప్రక్కన)].

శత్రు — మాతా! నేను దశరథుఁడు పట్టాభిషేకము చేయ నెంచినవాఁడను గాను. మా తల్లి వరముల నడిగి నన్నభిషిక్తుఁ జేయఁ గోరదయ్యెఁగదా? నా మాట నమ్మవచ్చును. ఈ భరతుఁ డయోధ్య విడిచినది మొదలు నేటివఱకు వీనితోడ నేయున్నాను. ఈతఁడు నిరపరాధుసుమా!

వసి — కౌసల్యాదేవీ! ఈభరతుఁడు నిష్కళంకుఁడు. వానిమన్నింపుము.

భ — మాతా! నేనిష్కళంకుఁడఁ గాను. ఏపాప మొనరింపకున్నను, కులవిధ్వంసనముగా వెలసిన యీ గోముఖవ్యాఘ్రమును, నా వజ్రహృదయను, నా కైకను జనించిన పాపమే--

కౌస — (భరతుని నాలింగనము చేసి) కుమారా! భరతా! నిశుద్ధమానసము నెఱుఁగనా? కళవళముఁగన్న సముద్రములోని యలలమాడ్కిఁ బైపైవచ్చు దుఃఖపరంపరల కోర్వక యిట్లాడితి. క్షమింపుము.

అనుబంధము 46

ఆ రాముఁడే వెలి నిను వేలుగాఁ జూచునా? నీవే మా రాముఁడవింక. అయ్యో! అకైక నేల యిట్లాడెదవు? నాకు సంతాపము కలుగదా? చిన్ననాఁటనుండి దాని నెఱుఁగనా? దశరథుని శాపము ఫలింప దానికి నేఁడిట్టి బుద్ధిపుట్టెఁ గాక, యన్యథా యిది స్వబుద్ధి గాదు. మంథర బోధనమే యని తెలియదా?

కైక—(ముందటికివచ్చి కౌసల్యపాదములపైఁబడి) జననీ! స్వబుద్ధికాదని యేలందువు? మంథర చెప్పినమాత్రముననే, నాబుద్ధి పురువుమేసెనా? అమ్మా! మాజననికిమాఱుగా నీవున్నదానవు. తల్లియెదుటఁబోలె వచించెదను. ఆమంథర నాపాలివిధివోలెఁ బోధించెను. ఎంతబుద్ధితిరిగినను మానకయుపదేశించెను. అప్పటికదియే ప్రియమయ్యె. శివమెత్తిన చందమున శరీరముపైఁబ్రజ్ఞలేక యెట్టివరములడిగితినో, యేమొనర్చితినో, యెఱుఁగను. ఒక్కపాపము వేఱొక్కపాపమునకుఁ దెరువుఁజూపెను. ఒక్కసారి పాపమొనర్చిన కఠినహృదయము దానిమెత్తపఱచు సందర్భములు గలిగినట్లంతయు మఱింత కఠినమగుచువచ్చె. ఇట్లయి యీగతివచ్చితి. నీశాపోపహతిఁ గ్రుంగుచున్న నాకుఁ బ్రాయశ్చిత్తములేదు. బిడ్డయేయని కరుణించితివా, నాక్రూరకృత్యమున నరణ్యములపాలైయున్న రాముశరణము వేడఁబోయెదను. అతఁడెట్లొనర్చినను హితమే.

## అనుబంధము 47

కౌస—(కైకనుగౌఁగిలించి యేడ్చును).

అందఱు—(ఏడ్చెదరు).

వసి—ఇట్లూరక దుఃఖించిన నేమిప్రయోజనము? ఈకైకయే మనకిప్పుడుపదేశకర్త్రియాయె. ఇక్కడికార్యములఁదీర్చి యరణ్యములకు మనమందఱముపోయి రాముని నుపాసింతము. లెండు.

శత్రు—ఇక్కడి కార్యములేమున్నవి? ఇప్పుడె వెడలుదము.

వసి—దశరథుని పారలౌకికక్రియలు—

అందఱు—హా! దుఃఖము.

భర—సంయమీంద్రా! మాతండ్రిని సుగంధతైలకటాహమున నుంచితిమంటిరే? చూడ నైనఁ జూచెదము. కొనిపొమ్మా!

అందఱు—హా! హా! (నిష్క్ర).

—( చతుర్థాంకము సమాప్తము )—

—❧❧O❧❧—



# పాదుకాపట్టాభిషేకము.

## పఞ్చమాఙ్కము-ప్రథమరంగము.

### అడవిలోఁ బర్ణశాల.

[ప్ర: రాముఁడు-సీత- (రాముఁడు జడలతో)].

రామ—సీతా! చూచితివా? యీచిత్రకూటాద్రి యెంతరమణీయముగానున్నది! ఎట్టి నిదాఘోష్ణదినములయు మధ్యాహ్నమున నెంతచల్లఁగానున్నది.

సీత—అవును. కడురమణీయముగానున్నది. ఇందెన్నిదినములుండినను దృప్తికలుగదు. ఈఘనాటవుల నీనగాగ్రములఁ జెట్లెంతగొప్పవి. చూడుమా! యీయశ్వత్థవృక్ష మెంత పెద్దదియో.

రామ—ఇదియేరీతి మన మయోధ్యవిడిచిననాఁడు తమసాతీరమున నొక్కయశ్వత్థవృక్షాంతికముననే విశ్రమించియుండలేదా? అదియేమి తక్కువగానుండెను?

సీత—అయోధ్యాపుర పౌరులందఱును మనమును విశ్రమించియుండినదిగదా? అదియుఁ బెద్దదియే. అయ్యో! ఆరాత్రి యర్ధరాత్రమున మనము పౌరుల కన్నుమఱుగించి యేతెంచితిమే. వారెంత దుఃఖించిరో!

రామ—అట్లుచేయకున్న వారు మమ్ము విడుచుచుండిరా? ఇప్పుడు మాటలాడిన దేమి? వృక్షములవిషయముగదా? గంగాతీరమున నొకరాత్రి గారచెట్టు నీడనుంటిమే. ఆవృక్ష మెట్లుండెను?

సీత—అదియును బెద్దదియే. మఱియెక్కడనో యింకను గొప్పవృక్షముఁ జూచితిమి?

రామ—శృంగిబేరపురమున గుహునితో నున్నప్పుడు చూచినదియేకదా వటవృక్షము.

సీత—అవునవును. ఆవటవృక్షము పాలేకాదా—

రామ—దానిని లక్ష్మణుఁడు నుపయోగించి జడలుదాల్చినది. సీతా! ఆనాఁడు నీవెంత యేడ్చితివి? ఇప్పుడీజడలతో నెట్లున్నాఁడను?

సీత—ఆయనంగుని సంహరించిన పురవైరివలె నున్నాఁడవుగదా?

రామ—అయిన నాకు ఫాలలోచనమేదీ?

సీత—మొన్నఁజూచితి నాఫాలలోచనమును.

కం॥ మాటలఁ గ్రమ్మకు కన్నులఁ
గంటక మొనరించునట్టి కాకాసురునిన్
గెంటింపఁ గనినవేళ
న్గంటిన్ నీఫాలలోచనము ప్రాణేశా॥

నీవు పర్ణశాలనా తొడపై నిద్రింప నన్నుఁ జెనకిన కాకాసురుపై నీవిషీకమునైచి నపుడు నిక్కువముగా నీకు ఫాలలోచనత్వము లవడియుండె.

రామ—నాకుఁ గల్గినకోపమునుఁ బల్కెదవా?

సీత—కోపము నేకాదు. ఆకాకము తనకన్ను నీయస్త్రమునకివ్వలేదో. అదియే నీఫాల లోచనము. అప్పుడే నీవుమూసినది.

రామ—అయిన నీవాపురవైరి కనంగుని సంహరించిన పిదపఁ జేకూరిన గిరిరాజసుతవే.

సీత—ఆమె నేనెట్లగుదు? ఆమె శంకరులో నర్ధాంగిని కాదా?

రామ—నీకర్ధాంగి మేటికి పూర్ణాంగముగావింతు (కౌఁగలించును).

[ప్ర: (శీఘ్రగమనమున విల్లెత్తుకొని)-లక్ష్మణుండు].

అనుబంధము 48

నీశాంతగుణమే నిన్నింతపఁడచ్చె. లెమ్ము. పైఁబడియేతెంచు శత్రుస్తోమమును జంపి చెండాడుదము. నీవురాకున్న నాకైన నాజ్ఞ యిమ్ము.

రామ—నీమాట లేమియుఁ దెలియవు-శత్రుస్తోమ మేది?

లక్ష్మ—అందుఁజూడుము. ధూళి యెట్లెగయుచున్నదో!

రామ—అవును. దేనిధూళియది?

లక్ష్మ—భరతాది శత్రువర్గము వచ్చుచున్నది.

రామ—నీకెట్లు తెలిసెను?

లక్ష్మ—ఆచెట్టెక్కి చూచితిని. కోవిదారాదిధ్వజము లగపడెను.

రామ—అయిన భరతు నేమిచేయ నెంచితివి?

లక్ష్మ—ఇదె నాబాణము. అదెవాని వక్షఃపీఠి. ఏది కఠినమో చూచెద.

రామ—అట్లేటికి?

లక్ష్మ—నిన్నుఁ గాదని తాఁబట్టము గట్టికొన్నది చాలక, మహాగర్వసంరంభమున మనపై వచ్చుచున్నాఁడుగదా?

రామ — అనుబంధము ·49

లక్ష్మణా! దశరథుని కొడుకవై, నా సోదరుఁడవై, సుమిత్రగన్న వాఁడవై, నీవిట్లాడుట చెల్లునా? ఆభరతుఁడెవ్వఁడని యెంచితివి! నీకంటె నాకుఁగూర్చువాఁడు. నీకంటె వాఁడేమిటఁదక్కువ? నీయట్టి తామసగుణ మొక్కటి వానికిఁ గలుగదు గాక పురముచేరి పట్టముల్లక దశరథుపంపున మమ్ముఁ బ్రార్థింపఁగదా వాఁడిటు వచ్చియుండవలయు?

[ప్ర: భరతుఁడు-శత్రుఘ్నుఁడు-(దూరమున)]

భర — శత్రుఘ్నా! చూచితివే లోకములన్నియుఁగటాక్షమాత్రమున నేలఁజాలిన ధీరు డెట్లున్నాఁడు! సార్వభౌమ సింహాసన పీఠిపై నివాసము వేష్టిత రాజరాజన్యుల మౌళులకుఁ గళలు దెచ్చు దివ్యరత్నమణీవితాన ప్రభామహితంబగు కిరీటము ధరింపఁగల ప్రాజ్యశిరంబెట్టు భూషణ విహీనమైయున్నది. చూచిన నెట్టిమానసమును నీఱుగాక పోవునే!

శా॥ గాత్రంబల్లనఁ జిక్కె దైన్యము సమగ్రంబయ్యె నెమ్మోమునన్
నేత్రంబుల్ముకుళాబ్జసన్నిభములై నిస్సారతం జూపెనో
శత్రుఘ్నా! కనుఁగొన్న మానసము చంచత్కీలలన్ గ్రాఁగదే
శత్రుఘ్నోగ్రరుఁగాదె వైరులకు నీచందంబు వాటిల్లఁగన్॥

(శత్రుఘ్నునితో నమస్కరించును).

రామ — (భరతు నాలింగనముచేసి) భరతా! కుశలమా? రాజ్యమంతయు సురక్షితమా? ప్రకృతిజనుల బిడ్డలఁబోలె బ్రోచెదవా? రాజాంగములఁ జక్కఁగా నరయుచున్నవా? సేవకులఁగరుణఁ బాలింతువా? గోదేవ భూదేవులఁ బూజింతువా? వర్ణాశ్రమ ధర్మములఁ బాలింతువా? జారచోరులు లేరుగదా? ప్రభుమంత్రోత్సాహశక్తుల సామ దాన భేద దండములఁ జక్కఁగా నెఱిఁగితివా? షడ్గుణంబుల గ్రహించి సప్తవ్యసనముల మాని చతుర్దశ పాపంబుల వర్జించి పాలితులకు దుఃఖము లేకుండఁ గోరుకొనుచు సత్యైక వ్రతుఁడవై ధర్మైకనిష్ఠుఁడవై సావధానుఁడవై యున్నాఁడవే కదా? తమ్ముఁడా! నీవేల యిందు రావలయు? ఎప్పుడో కష్టమైన నీక్షేమోదంతము మాకుఁ జెప్పిపంపి యుండినఁ జాలదా? అదియేమిట్లు కన్నీరునించెదవు? నాకొఱకు వగచెదవా? లేక నీకొఱకా?

భర — అన్నా! ఎవరికొఱకేల నాకొఱకే వగచెదను.

రామ — తమ్ముఁడా! మనవారందఱికిని సౌఖ్యమేకదా?

మత్త॥ రాజపూజితుఁడల్లతండ్రి ధరావిభుండు సుఖుండెయా
రాజదేవులుతల్లులందఱు రాణమొందెడువారలే
భూజనంబులునిన్నుభక్తినిఁ బూజచేసెడువారెయా
యోజఁగన్నులనీరుగారెడు నయోధ్య యిదేటికిసోదరా ॥

భర—హా! నిర్భరము.

రామ—భరతా! ఏమినిర్భరము? నాపాడుచెవులకు నీవాడెట్టివార్తఁజెప్పనున్నావు?

భర—అన్నా! ఇంతకువచ్చి సంకోచమేల?

గీ॥ మనకులాధ్యుండు మనరాజు మనగురుండు
మనసుదైవము మననిధి మనధనంబు
మనదు భాగ్యంబు మనవాసి మనబలంబు
మనసుకృతరాశి మనతండ్రి మనకు లేఁడు॥

[ప్రవేశము: వసిష్ఠుఁడు (దూరమున)].

రామ, లక్ష్మ — హా! జనకా! జనకా! (మూర్ఛిల్లెదరు).

అనుబంధము 50

రామ—మాతండ్రి మము ముద్దుచేసి పెంచి కాపాడినతండ్రి. సత్యప్రతిజ్ఞుఁడై, కరుణా గుణభూషణుఁడై చిరరాజ్యమేలినతండ్రి మాకు లేఁడయ్యెఁగా. కటకటా! ఎట్టి పాపపువార్త—

వసి—రామచంద్రా! సకలతత్త్వవేదివైన నీకిట్టిప్రాకృతభంగి యేలకలిగె? సహింపుము. నీముగ్గురుతల్లులు నినుఁజూచుటకై వచ్చియున్నారు. నీపోటునకు శోకఘూర్ణమాన మానసులై యున్నారు. వారినూఱడింపుము. సోదరులురమ్ము.

(నిష్క్ర-మి)

పంచమాంకము-ద్వితీయరంగము.

అడవియే పర్ణశాల.

[ప్ర: రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు, వసిష్ఠుఁడు, సీత, కైకేయి కౌసల్య, సుమిత్ర, కూర్చుండి భరతుఁడు (జడలతో)].

భర—అగ్రజా! నమస్కరించి విన్నవింతును. నీవులేని వైకుంఠపదవియైన నొల్లననుట నీవెఱుఁగవా? నీవభిషేకమున కియ్యకొన్నను విహితమే. ఈరూపమునసే నను నీదండనుండ సమ్మతించినను విహితమే.

రామ—భరతా! ఈజడలు నారచీరలు నీకేల? మనజనకుఁడు నినుబట్టమునకు నియమించియుండ నీవు జరుపకున్న వెట్లు?

భ—జనకుని యాజ్ఞ తెలియంగున రాజ్యమే నాయదిగదా? నిశ్చలమానస నేనీకిచ్చుచున్నాఁడనే. ఏల యనుగ్రహింపరాదు?

రామ—పదునాల్గేండ్లరణ్యములు నుండెదనని నేవచించితినే. అదితప్పుదునా?

కైక—రామా! నాకొఱకైకదా నిన్నా జనకుండరణ్యములకనుపుట? వరములడుగుట కెట్లో వానివదలుటకును నాకు స్వాతంత్ర్యముగలుగదా? నేనే యిప్పుడు వలదనుచున్నానే. నీకేటికిప్రతిజ్ఞ?

## అనుబంధము 51

రామ—జననీ! ఎఱిఁగి యెఱిఁగి యిట్లేలాడెదవు? నాకాజ్ఞయొసగినవాఁడు జనకుఁడుగదా? అతఁడు లేఁడే. అతఁడుండి యీమాటచెప్పియుండిన నెట్లగుచుండెనో కాని యిప్పుడు తిరిగిన నధర్మము.

కైక—మృగబోంద వలను నన్ను నానాఘుఁడు కన్నెత్తిచూడఁడాయెనే.

భ—అన్నా! మాకిట్లయిట్లున్నది. దశరథుఁడుగక ప్రాయరాదని యీ సంయమీంద్రుఁడు జనకుఁడు చెప్పుచు జాబె నాసుప్రాయఁడాయు. నేనేమి చేయుదును? కాని, దశరథుఁడు పిలిపించియుండిన వచ్చుచుంటి నంటివికదా? అదశరథుఁడే నిన్నరణ్యములు నుండుమనియె? ఈకైకకైగదా? ఆయమయే యిప్పుడు లేవుపవరములు వలదనుచున్నది. ఇప్పుడు దశరథుఁడున్న నిన్నురావలదనుచుండెనా? ఉన్నిశమింత విచారింపవలదా? నీవెట్లయిన దీక్షింపకున్న నేనన్యథాగతియెఱుగను. నీవు రాజ్యభారము వహించియున్న నీభృత్యుఁడనై యెట్టికార్యములైన నెఱవేర్పఁజాలుదుఁగాక, తాపసవృత్తినీవీయరణ్యములు నిట్లుండ నెట్టి సంతోషమున నేరాజ్యమేలుదు? ఏయూఁతట నేనిప్పృథ్వీభారము వహింతు? కరుణావిశేషమునను, దేహమహత్త్వమునను, నీ క్ష్రప్రతాపముల నైపుణిని, సర్వసిద్ధఁజేసియుఁ, ప్రభుత్వమహిమంగళ శక్తివిశేషములను, లోకములెల్ల నేలఁజాలిన నీవుఁదగుఁగాక యీరాజ్యము నాకు దగునా?

## అనుబంధము 52

(కాళ్ళుపట్టుకొనిపడును)

రామ—భరతా! (అని కాలువదలించుకొనును)

భర—(చేతఁజిక్కిన రాముపాదకము పట్టుకొనును).

రామ—నీవింక నిట్లాడిన నాయానగలదు. అవరజా! ప్రీతివిశేషమున మదిదెలియ కిట్లాడెదవుకాక, ముందువెనుకలు యోచింపవే? ఆదశరథుండుండిన ననురమ్మని యుండు. నిక్కువమే. ఆయనలేడే. ఇట్టిచో నేవచ్చిన రాజ్యలోభుండనియుం. ప్రభుత్వైక కాముండనియు, జనులు కొందరైన నన్నెంచరే. ప్రాణములనైనం బాసెదంగాక నిందకోర్వంజాల. దీర్ఘాలోచనమొనర్చిన నామతియు మీకే శ్రేష్ఠతమమనితోంపకుండదు. బాధింపకుండు. మన్నింపుండు.

## అనుబంధము 53

భ—(పాదుకలం జేతంబట్టి) అన్నా! నీవు కాళ్లువదలించుకొనినపుడు దైవానుగ్రహమున నీపాదుకలు నాచేంజిక్కె. ఇంతమాత్రమైన ననుగ్రహింపుము. నీవు పురికి రాకున్నను, నన్ను నీవెంటనుండ నీకున్నను, నీమారుగా వీనినైన సింహాసనమునునుంచి యభిషేక మొనర్పనానతిమ్ము. (నమస్కరించును).

వసి—రామా! ఇది నిరుపాధికము. ఎవ్వరిప్రతిజ్ఞంబును భంగముగాకుండునట్లును ఏన యభీష్టము నెఱవేఱునట్లును వేఁడినాఁడు.

కౌస—రామా! నీయెడ భరతునకెంత భక్తియో దీననే యెఱుంగనగుంగదా? అట్టి భక్తిపరుని యభీష్టము నెఱవేర్పుము.

## అనుబంధము 54

రామ—(భరతు నాలింగనముచేసి) ప్రియానుజా! నీకోరికకంటె నాకొనర్పందగిన దేమున్నది? తల్లులారా! మీయానతి మాఱుదునా?

భ—అహా! లలనీకృత ప్రస్తరనిక్షేపదములే! రిపుశిరస్సచ్ఛేదములే! క్షోణీభరసుర్యాదములే! అవ్యయమాత్ప్రసాదములే! కమలినీకృతవివాదములే! అపగతలోకనిర్వాదములే! కుష్ఠుతవిషాదములే! లతాంతామోదములే! నిర్గమ్నశ్రీసుచస్వేదములే! ప్రక్షాళితభూసతీముఖమృగమదశాదములే! అనురాగశీనగ్నవిచ్ఛేదములే! ఆలంబితసహాంతివేదములే! ఈపాదములు. భళిరే. తమోహారణ లరుణాయమాన కిరణములు, సర్వలోకభారధరణములు, శ్రుతిశిరోలంకరణములు, భవసాగరతారణములు, సుజనమహితాభరణములు, ఈచరణములు. ఇవి నాకుపలభించెంగా! నాకామోదము నించెంగా! మనఃఖేదము హరించెంగా! నాసుకృతము మించెంగా! నాయభీష్టముం జెల్లించెంగా! సంయమీంద్రా! నీవిడినలగ్నమున రాముని కాన్యవాసము లభించెనని యయోధ్యలోని మందబుద్ధు లనిరిగదా? ఆలగ్నముననే మాతల్లిచేం గావింపంబడి రామునకు నిష్కారణముచే నేపాదుక లొసంగంబడెనో, వానికి

పట్టాభిషేకము జరిగెనే? ఆహా! యెట్టిలగ్నబలము! రామచంద్రా! అపాదూఁగు నట్టియు, నీవరణ్యమున కేగిన జ్ఞాపకమును, దశరథుఁడు కాలధర్మము నొందిన జ్ఞాపకమును దచ్చినట్టియు, నయోధ్య నే నుండఁజాల. నీప్రస్థానమవుటవలన దాని గన్నెత్తియయినఁజూపను. నందిగ్రామముననే యుండెదను. రామా! నాకు సెలవిమ్ము. ఇదె యీపద నాలుగు వర్షము లెట్లయినఁగడపెదను. పదునాల్గేండ్లును బది నాల్గుగడియలుగాఁగడపిన నభిలషించు నాకు నీవియోగకారణమునఁ జేసి పది నాలుగుగడియలే పదునాల్గువత్సరములుగాఁ దోఁచుచున్నవి. అయినఁగడపెద. ఎట్లోగడపెద. అంగీరస సంవత్సర చైత్ర శు|| ౯కిఁ బదునాల్గుపూర్ణయగును నిండఁ గిలవుగదా? ఆనాఁడు నీమంగళదర్శనము నాకుఁ గలుగకుండిన మనఁజాల. నిక్కముగా మనఁజాల. తల్లులారా! ఇందుండుకొలఁది వియోగము వలని దాహమగ్గల మయ్యెడు.

## అనుబంధము 55

## అనుబంధము 56

సీత—భరతా! జాబువ్రాసితివే.

భర—అన్నా! శత్రుఘ్నుఁడు కుత్తుకఁ ద్రొక్కఁ బ్రాణమాత్రావశిష్టయై యూలుదినను యుండి మంధర మృతినొందెనని యెఱిఁగితివికదా? అది మున్నువేళ నీప్రతిక వ్రాయించినది. నీకిమ్మన్నది.

రామ—(చదివి) భరతా! ఎంత సకరుణముగా వ్రాసియున్నది. మంథరా! నన్ను క్షమింప వేఁడవలయునా? నాకేమపకార మొనర్చితివి? నిక్కముగా క్షమించితి.

భర—అన్నా! మఱియొక విజ్ఞాపనము. ఈపాదుకలకుఁ బట్టాభిషేకమీయనే యొనర్పవలయునని నాయభిలాషము. అయోధ్యకుఁ బోవలెనా? ఇక నంది గ్రామమునైననేమి? ఇంకైననేమి? నీసాన్నిధ్యముననే యుండుట భాగ్యమగుఁగదా?

రామ—తమ్ముఁడా! నీకెట్లభీష్టమో యట్లనే కానిమ్ము.

భర—(పాదుకలకుఁ బట్టాభిషేక మొనర్చును).

## అనుబంధము 57

—(మంగళం)—

# అనుబంధములు.



అనుబంధములు.

1. సూత్ర—శ్రీరాగము-రూపక తాళము.

అమరావన-విమలానుత-కమలాసన-మారమణ ॥పల్లవి॥
సమదాసుర దమనానీకు-నమస్కృతులు-పీతాంబర ॥అను॥
ఘనాగమను-తనామనిను-వినానైవ మెఱుఁగ
అనపాయ-పదముఁగోరుచు-సనకా-దినుతా-వినతా
వనశీలా-నిన్నుఁగోల్చితి ౧
అపారమన కృపాలిత-సుపావనాదిపుహారా
విపాకముల నెడలించుచు-నపరా-ధవరుక్ విపులా
ధిపనన్నుం-గృపజూడవె ౨
నా-మనవివినవే-ననుదయఁగనవే-యనవరతము
తిన్నని-విన్నప-మెన్నుచుఁ-కా-ధా-రా
తారణ-వైరిని-కారణ-వారణ-తారణ-శుభకర ॥

2. నటి—రాగము-మోహన-రూపక తాళము.

ఘనవేణీ-యజరాణీ-వనరుహాకిసలయపాణీ
ననుదయఁజూడుము రాణి-కనికరమున వాణీ
అనుదినసుతగీర్వాణి-కనదనుచరదింద్రాణీ
వినతాశ్రిత-జనతాపహా-సునయనవిజితైణీ
జననుతదైవతమాణీ-ఘనకల్యాణీ ॥

3. దశరథుఁడు — రాగము-శంకరాభరణము-ఆదితాళము.

ఇంతఘోరవిధానమాయెనే ||పల్లవి||

ఇంత యైనఁ జూడకీధరాసుతుని నంత ముందఁ జేసినాఁడనయ్యయో
పిల్లుశోకమునఁ బెంపుపక్క-వీని తల్లిదండ్రులెంత తాపమొందుచు
తల్లడిల్లువారో తాళఁజాలనే నొల్లనొల్ల వారి కోపఁ జెప్పవీని

4. దశ — రాగము-ఝంఝూటి-తాళము.

పావన మౌనిపుంగవమా ఓ
శాపకుమా డోపకుమా చూపకుమా క్రోపకుమా ||ప||
ఓపిననిర్దయనీదు పాపనిజంపిన
పాపమునకు నాకు శాపమొసఁగరాదే ౧

5. రామ — రాగము-కేదార-రూపకతాళము.

రావలదే తమ్ముఁడిటకును
భూవరనుత ధీవిదిత ||పల్లవి||
చిన్నతమ్ములిందు రాక చేయనేటికి
కన్నతండ్రి వేఁడువాఁడ నున్నతివలదెన్నఁడైన ౧

6 దశ — రాగము-మోహన-ఆదితాళము.

తనుజాతా యేలుమా
భూతలమంతయుఁ బ్రీతిజనింప
పారకనీకిటు పట్టముగట్టిన
ధారుణినాదగు భారముదీఱు

7. కైక — రాగము-కమాజు-ఆటతాళము.

నేవినఁజాలను వెలఁదీ వలదీ-కొలది
జగదభిరాముని జానకీకాముని
తెగడెద వేటికి నగునే తగునే-పగయేమె ॥నేవి॥

8. కైక — రాగము-ముఖారి-ఆదితాళము.

హా హా యిదియెంతపాప మహాహా ॥[illegible]॥
ఇంతటిమాటలు నెటులాడఁజాలితే
సంతాపమెంత దురంతమాయె ॥ఆహా॥

9. కైక — రాగము-హిందూస్థానిఫరజ్-ఆదితాళము.

మంథరా-నన్నిటు కావవే యో ॥మ॥
మునిఁగితివనధిని ననుదరిఁజేర్పవే
కసికరంబునను-గాపాడవె యో ౧

10. దశ — రాగము-సనరోజు-ఆదితాళము.

వింతలాయె కామినిఁజూడఁగ వింతలాయె
ఇంతిరో నీటువంతలఁ జెందుట వింత॥
నారీమణిసీ చందముచూచిన వింతలాయె
భూరివిచారమొ కోరికరీతియొ కూర్మివెలార్పుము. ॥వింత॥

11. కైక — రాగము-నీలాంబరి-ఆటతాళము.

మోసపోయితినయ్యో నాథునినమ్మి
ప్రాణనాథుఁడునన్నుఁ బ్రాణపదముగాఁగ
దానెంచునని మది నేనమ్మియుంటిని ౧

12. దశ — రాగము-కమాజు-రూపకతాళము.

కోరకుమా సరసీరుహావదనా
మానిని యీ క్రూరభంగి మానుదీరుపై
ఓ-చానసూను-గానఁదోలు-టీనెఱితగునే

13. దశ — రాగము-కేదార-ఆదితాళము.

చెలి యీపాటు సైరింపనే
హా-నాపుత్రునాకీయవే (నాపట్టినేఁబంపనే)
నీకేలంటి కాలంటినే నీలాగు వేషంగనీ
జాల మేల తాళఁ జాలబాలి లీల బాలా

14. రాము — రాగము-కానడ-అటతాళము.

చూడవేల మాటాడవేల
నేఁడిదేటికీ శోకములీల
(తండ్రినీ-వాఁడనుగానో)
నామీదకోపమొ ప్రేమముచూపవు
రామా యనిపిల్వ వేమపరాధమొ॥

15. రామ — రాగము రాగమాలిక-రూపకతాళము.

జనకా నీకిటు లేటికి-నతితాపము జనియించెరో
మనసారగ నాకార్యము వినుపింపఁగదే॥ ॥కాంభోజి॥
మించినతమినే భూతల సంచారము మొగవేమని
నెంచితి దానికినిటుశోకించఁగనేలా ॥కేదారగౌళ॥
నాసోదరుఁ డతికరుణా భాసురుండా భరతుఁడు
నీసూనుఁడు రాజగుటకుఁ గాసిలవలెనా ॥దర్బార్॥

ఎడరేయిది కైకేయియుఁ గడుకూరిమి గలతల్లియొ
అడుగఁగ రాదే వరముల నడలఁగనేలా ॥మోహన॥
నీకై యనలముఁజొచ్చెద నీకొడుకను నీదాసుఁడ
నాకానకుఁబోఁజాలనే శోకమిఁకేలా ॥శహన॥
గాసిల్లకు మిదెవచ్చెదఁ గౌసల్యకు వివరించెద
నాసీతకుఁ జెప్పెదనా యాసమువలదు ॥శంకరాభరణ॥

16. కౌస — రాగము-ధన్యాసి రూపకతాళము.

ఈవిధమున కేమిసేయుదు ఇఁకెందుబోవుదు
బాలమన్మథనిన్నుఁగానల పాలుచేసిశోకమే
లీలఁగుదుర్ప్రాణసమితి తాళఁదాననే ౧
కైకగర్భమునందుపుట్టక నాకుఁగల్గినందుకా
భీకరాటవులకుఁబోయి తేకుమారక ౨

17. రామ — రాగము మోహన-ఏకతాళము.

ఇటువేకారినీకేల శోకింపఁగాఁదల్లిరో
సుశ్లోకవు నీవెందునుచాలు ॥ప॥
నీమాటపైనమ్మరో నేనీమాడ్కినిందుండిన
భూమిధవు నేమనను దేమగుస తీమణీరో
యీమాటలాడకుమోమాత ౧

18. సీత — రాగము-అఠాణ రూపకతాళము.

అపరాధమేమి నాథానాయెడ॥నప॥ ॥ప॥
తలపిఱించి కుందురీతిగాఁ గృపమానెనేమిసేఁ జేసితి
ననునీవు బాసిపోవఁ మసియుందు నంచునెంచితే
వనభూమి నీవుచేరఁగా మనసారనీటి నేనుందునే ౧

 రామ — రాగము-కమాజు ఆటతాళము.

భామాచన దీమ నపము న మోహాపు ||ప||
ప్రేమాయతి నీమాటల నేమాడెద వ్రాసూవిని ||అను||
శాలావణి హేలాసుఖ లీలావతి వాలాయము
చాలావెతఁ దూలంగని కేలామఱియాలాగున ౧

20. సీత — రాగము-బ్యాగు రూపకతాళము.

పాదములాన నీ-పాదములాన
కాదనక శోకసాగర మీఁదఁగఁజాల ||ప||
భూపతిలకమేన ప్రాణ మోపదంచగా
నాపయినీబాలఁజంపు పాపము రాదా ౧

21. కైక — రాగము-శంకరాభరణము అటతాళము.

భూపాలుఁడు స్వైపోవునో ||ప||
పరితాపము గలిగె ||అను||
ఏతని చెప్పుదు సంతాపవైఖరి
అంతము గానని చింతల రమణీ ౧

22. కౌస — రాగము-కానడ ఏకతాళము.

కటకట కాంత-యెటువలెసింత
కటుతర చింత-పడియెదో వింత
కైకేయి పట్టికి నీరాజ్యమిమ్మిక-నాకిమ్మని సూనుని
నాకిచ్చి కావుమా ౧
సుమి — నీరాముడెంతటి నేరము జేసెను
ఘోరాటవులను జేరంగనాథ ౧

సుమిత్ర } వైరులకై నను వలవదీ దుఃఖము
కౌసల్య } ఏరీతిఁ దీర్చెద వో రాజశేఖర

23. దశ — రాగము - కేదార రూపకతాళము.

నీరజముఖులారా వర ॥ ॥ప॥
నేమించుకైన నే నెఱుంగ నిజ మీరక్కసి సాధించెను
కోరి భూరి వైరము ॥
కనికరమింతైనను గనక వసితపరము లనియడిగెను
ఘనమగు పరితాపమడరెను మనఁజాలఁగద మనసులఁ సుఁ
గసలకుఁ డికఁ ౧

24. కాప — రాగము ఆనందభైరవి ఏకతాళము.

వర తమాల వేణి హో నాదానా
కుమారుఁడయెఁగ నరావా ॥ప॥
బాలా వైరము తేలా కోపము - మేలా - ననుదయఁజూచి వి
జాలా బాలుని పెలార్పకు హేలాగుణ జలా ॥౧॥

25. కౌస, దశ — రాగము - సురటి ఆదితాళము.

ననుఁ దలచి దయఁజూడవే సతీ
కొనకి దేలా యింత కోపము బూనఁగ ॥ప॥
కైక — ఇది తగునె కనునార దిప్తి
మదిని నామాటింక మానఁగఁజాలనే
కౌస — బాలా వైర మేలా నేరమేమి పరమాదరణ విడఁగ ౧
కైక — మేలి మాటనాడే నేరమాయె మాలఁతా వలదీ-పలుకు
దశ — ఈరీతి మేరాచి కోరాశి వైరము ఇరవాటఁగనీ ప్ర
భరమా యోతాళ ౨

25 సుమి — రాగము-ఇంగ్లీషునోటు-ఆదితాళము.

సరసిజలోచనచూడవే తరమగునే భీ-కరమగుచందము ॥ప॥
శ్రీకరుండగు రాకుమారుని భీకరాటవిఁ జేర్పకుమా
నీకచెడుబలు కాకతగదిది కైకనీకును గరుణయుఁగలుగదే ౧
మానకదశరథుసూనుని నో-మానివి కానకుఁబంపెదవే
చాన-నాకును-సూనులిరువురు పూనివలసిన-వాని
నుంచు కానలోన ౨

26. సుమి — రాగము-హిందూస్తాని-చాపుతాళము.

సుందరాంగి కైకేయునీ కెందుకేయీ క్రూరభంగి॥ డెందమునఁ
గరుణలేక మందయాన మహిన్నెల్లఁగుందఁజేయు కేటికమ్మ
కానలోన దశరథుసూనుఁడుండఁ గోరితేని మానవతినాకిద్దరు
గానవారిలోననొకనిఁ బూనిపంపు సోదరినీ కెందుకింత ౨

27. కాప — రాగము ఆనందభైరవి-ఏకతాళము.

కైకా మానవె కాక రామునిపోక భరతుఁడు నచ్చునదాకె
చేకొనుమీ కైవడి పోకార్పకు పోక ॥వరతమాల॥

28. కైక — రాగము-కేదార-రూపకతాళము.

పోలదెమీ మేలిపల్కులు-ఇాకేలా చాలును
బాలఁగానరు గోలఁగాఁగొని కేలిచేయఁగఁజాలువారలె
వెలయఁగమీమాటలబాలు వినానిణ ముసిండారెను
తాఁపడుఁడీనన్ను మోసముసలుపు కూటసవతులార॥

29. లక్ష్మ — రాగము-దర్బారు రూపకతాళము.

వింటిరేసదస్యులారా వెలఁదిమాటల
కంటగించిరాముఁడువాలు గంటిచందము ॥
క్రూరభంగనీమోముగనిఁ గోరెవరముల
తారతమ్యమరసికనుఁడు ధర్మసూక్ష్మము

30. లక్ష్మ — రాగము-కేదారగౌళ ఆదితాళము.

కోపముచేఁగడు పాపములనాడితి
భూపతిలకనాకు శాపమొసంగవె
తాళఁగతల్లినీ దండించఁదూరితి
పోలదీపాపపు నాలుకఁగోయంగరాదే ॥

31 రాగము-భూపాళం ఆటతాళము.

రామ, లక్ష్మ, సీత } చాలా మీరలడలవలవదీవేళ
ఈలోననేపురలిచ్చెదము వెగమెయింకేలా

దశ, కౌస, సుమి } చాలా తాపమెటులఁదాళుదుమీవేళ
నీలాగాయె మానోముఫలము చూడఁగనింకేలా ॥ప॥

రాము — కళవళింపకుఁడింక మాకయి బలముగాఁదలిదండ్రులారా
తలఁపరే పసుపరే పలుకరే సేమముగ

సీత — నతులొనర్చెదమధికభక్తినిఁ బితరులార శుభంబుగోరుచు
వెతలఁబోవిడిచిమమ్మనుపరేసౌఖ్యముగ ౧

లక్ష్మ — నేమనంబిమఁడింక సీతారాముల వెనువెంటఁబోయెద
ప్రేమతో సేమమే కోరుఁడీ పంపుఁడీక ౨

సుమి— రామనీమహిమాంశుఁబోలిన మోముఁజూడఁగమరలఁగల్గెను
సేమమింపారఁగా లీలనైబోయిరము 3

కౌస— అపవ్రులనుఁబాలించినాదగు కొడుకుగోడలిమరలనాకె
ట్లిశియెదో బాలకా లక్ష్మణా సేమముగ ౪

దశ— పాడియౌఁటుఁగకనిన్ను నీపతితోడఁగానలకంపుటిదియే
జాడయో కోసలాచేడెరో చూడకిఁక ౫

32. పౌరులు — రాగము-శంకరాభరణము ఆదితాళము.

దిట్టతనంబునవెడలండి కట్టిగధైర్యముపట్టండి
పొట్టలుఁదొక్కలుచీల్చండి కట్టుఁగంతులఁగాల్చండి
రాముని కానలలోఁజేర్చె తామసించిటులుపోకార్చె
మోమోటంబసివిడువండి ఆముండలనడిపోడవండి ౧
కైకరాజసతియఁగనేమి కాకామంధరముండేమి
లేకున్ననుదశరథుడేమి పోకుండఁగబడిమొత్తండి ౨
ఒత్తినమేల్పనిలువండి కిడ్డాయంబుగఁబిలువండి
అడ్డమువచ్చినవారలను గోడ్డంటునఁబడఁగొట్టండి ౩

33. రామ — రాగము-హిందూస్థాని-ఆదితాళము.

పౌరులార వేఁడెదఁ-భూరికరుణఁజూడఁడి
ఘోరపాపకార్యమాయె-ధీరులారవినఁడి
భూతలేశుభార్యమీకు మాతగాదొయెంచఁగా
భీతిలేకచేయువారె మాతృహింసనెంచఁగా ౧

34. దశ — రాగము-ఝంఝూటి-రూపకతాళము.

రాఁగదేనన్నుఁజేర రథముపూనిరాఘవా ॥ప॥

ఈసుమంత్రుఁడిట్టురథము నీసుచేసితోలెఁగా
భాసురాంగునన్నుఁబాపఁ జేసిపాపియయ్యెనే
ప్రేమమీఱఅనరదమింత తామసింపనిల్పుచునే
మహాత్మునైనమా రాముమాకునివ్వరే

౩౫. కైక — రాగము-పీలు-ఆదితాళము.

ఎంతద్రోహపు కార్యమొనర్చితి
వంతలెంతో వచ్చెనాకును ॥ప॥
భూపాలునిమది కాపగదాయనై రూపుమాపితి
ద్రోపదాయెనొకింతయుఁ-ద్రోపదాయె
నేపువ్రాయె-పాపమాయె

౩౬. దశ — రాగము-సావేరి-ఆదితాళము.

నేనేమితప్పుచేసితినో-రామా
దీనరక్షకనన్ను దిలకింపరావే ॥ప॥
ప్రేమచూపవునాపై-నేమినేఁజేసితి
రామా పాలింపవే-నామనవి
ఈమరణమువేళ-నేనిజూపవెనాకు-నీముద్దుగారునెమ్మోము
కుమాత ౧

౩౭. రాగము-ముఖారి ఆదితాళము.

కౌస } వెడలితే ప్రాణేశా-హాహా
కైక } కడుదయ-మానితేనాపై

కౌస— చెలులతోసూను-నినటపులకంచి
పటుతరశోకముపాలై-కటకటమమ్ముఁబాసితే ౧

సుమి — మోహమునించుచు-ముద్దులసతియని
యీహజెలంగఁగవింతై-ద్రోహమదేమినాథా  ౨

38. కైక — రాగము-హిందూస్తాని-ఆదితాళము.

జనలోకపాలా-ననుఁబాసితే
దీనతవాటిల-నానేరమెంచుచు
పోనాడనీదయ-హానాథపోయితే  ౧
వరములనుగనిఁకఁ-గరుణించిమా సుమా
భరతునిమాసి యీ-పరిరామునిల్పుమా  ౨

39. రాగము-భోగిసావేరి-ఆటతాళము.

కావవే-కావవే-కావవే  ॥ప॥
హా-ప్రాణేశ బాసితేమమ్మ దయ-లేనిచందముదోఁచెనమ్మ-
కరుణానిధిమనవిఁజేకొమ్మ-యీప్రాణమెయింక భారము
నీవు-లేనిదేమునమింతనమ్మ

(రెండవ యవనిక పడును)

మ-వమ్మ రయకనదలఁజేసి-నేఁవూర కెనును నెపఁబోసి
పోవ-వైరులమేగుణరాశి-కడఁ-తేరెనెమా బలువాసి
మను-వారమెనిన్నుఁదలపోసి॥  ౧

(ముందు యవనిక పడును)

40. భరత — రాగము-తోడి-రూపకతాళము.

పురిదాఁపున-కరుదేరగఁ-బరికింపవె-యరిసూదన
పరితాపము-భరియించుట-యరుదా మొఁగదే

చేతోభయ-మిా తెలిఁగువ-సీతాపము-నోతమ్ముఁడ
ఆతల్లుల-కాతండ్రికి-నే తెలిఁగదే

4.1 కైక—రాగము-శాహన-ఆదితాళము.

ఆయోయి కేగతి-వియోగతాపము తాళఁజాల వనజాక్షి ॥ప॥
పాపబుద్ధి నీవు నన్నుఁ బాడుచేసితి
భూపమూళితోడ నేను-బోవఁజాల నైనే-యయో ౧

42. శత్రు—రాగము-హిందూస్తానితోడి ఆటతాళము.

తామసమాయె నేమని యింక-రామునిఁ జూచువాడనో
యీతరి నింక భూతనుజాత-సీతను గాంచఁగూడునె
మతియెయింత పాతకియాయె-ప్రీతిదలంగ దైవమా ॥

43. భరత—రాగము సావేరి-రూపకతాళము.

మనఁగలనే-ఆహా
ఆ-మనుజాధిప రాముఁ జూడక ॥మన॥
వనభూమికేఁ దనుఁ బంపిన-ఘనపాపిని కా కైకకు
జనియించితినని రాముఁడు-నను నేఁడరగంటఁ జూచిన ॥మన॥ ౧

44. కౌస—రాగము-అభోగి ఆదితాళము.

హా హాయిఁక నేదిదారి
ధరణీశ రామునీ పురిఁ బాయఁ జేసియు
భరతునినైనను-బరికింపనైతివే ౧
ఆకైక కోరికఁ జేకొంచు రాముని
లోకాభిరాముని-నా కానఁ జేర్చితే ॥ ౨

45. భర—రాగము-కాపి ఆదితాళము.

సీర-మాతా-దయఁజూడకే
చింతింపకమ్మనా-యంతముఁజేయుమా
ఇంతమైనఁగీడు లేదు-సంతసింతునే ౧

46. కౌస—రాగము-తోడి-ఆటతాళము.

అన్న రోతాపంబు చేసీ-పిన్నమాటలాడితి
పిన్నమాటలాడితి
నిన్ను వేఱె-రాము వేఱె-యెన్ను దానఁగాను
ఎన్నకయీమాటలెల్ల-మన్ననంబు చేయవే ౧
పిల్లగామాప్రాప్తికిని-తల్లి యేమిచేసెను
చెల్లఁబోయాకైక నేలా చెడ్డమాటలాడెఁగా. ౨

47. కైక—రాగము-బిలహరి రూపకతాళము.

ఘోరపాతికినే-సారసాక్షిరో-చంపుముననను
క్రూరవరముఁ-గోరిచంపితి ధారుణీ లునిపా ప॥
భీతిఁగానక సీతనూజన-సీతల బను-నూతఁగోసితి
మాతనేఁబతి-ఘాతుకినఁ-బ్రీతిఁజూడకుము ౧

48. లక్ష్మ—రాగము-ఇంగ్లీషునోటు ఆదితాళము.

పసి-బాపునన్ను-నింపుమీ ఆసొంపునిందెద
నను-కంపమాని-ఆలింపినింపి-చింపిచంపెద
అడె-వైరిదారి మేలమిటి-చేరఁదేరఁగా
మద-మారఁజేసి-చీటికేది-పోరెద

49. రామ — రాగము-శాహాన-రూపకతాళము.

ఏలా యిట్టిమాటలీ వేళీలనాడితి
చాలా యోచించిచూచినీ-కేలాగుఁగల్గెనో
నాకూర్మిసోదరుండవై-యీకీడులేటికి
నీకేమి కావరంబో కో-కాకవివేకమో॥

50. రామ,లక్ష్మ — రాగము-శాహాన-రూపకతాళము.

మానగ మేయిఁక-జనకా ॥ప॥ నినుఁగనక ॥అ॥ ॥ప॥

రామ — సేవము జతించుచు నామోదము కన్నీటనఁ
ప్రేమముదైవారఁగ రామా యనుచుంటివే ౧

లక్ష్మ — కోపముడగదని-తీపారఁగబోధించితి
పాపముఁబాపిననుఁగాపాడవెచూడవె ౨

సీత — వీడక నాముద్దుల-కోడలనిమన్నించితి
చూడకననోన్నృప చూడామణిపోయితే 3

51. కైక — రాగము-యదుకులకాంభోజి-చాపుతాళము.

రిపు భీమా-దయజూడుమా-నీ-వీమాట
లేమాడెదామన్నన-ప్రేమమువీడఁగ-రామయిదేల॥
నోనాడి కాననము-లోనేఁద్రోసితిసని
పోనాడకమునన్ను-నానేరము లెంచకుము॥

కౌస — పున్నమచంద్రుని మిన్నతిఁగాంచుగతి-జెన్నారఁగ
నిన్నుఁగను-టన్నాయిఁక నెన్నాళ్ళకో ౧

భర — సోదరనిన్నుంగను-మోదము లేకయున్న-సాదరవి-నోదా
యిఁక-భేదమును-నేఁగాళ్ళను ౨

సుమి — బాలకి మేమీపదు-నాలుగువత్సరము-లేలాగునఁదా
ళుదుము-శీలాగుణజాలా యిఁక ౩

కైక — శ్రీకర కాపాడవె చేకొని మన్నించవె యిఁక కానల సోఁగతిఁ
జేకూర్చిన కైకేయిని ౪

శత్రు — ప్రేమునునిన్నుంగన కేమొ యనేనుండఁగ నామానసమే
మానో కో దేవమానసు. రామానిను ౫

56. రాముఁడు లక్ష్మ-సీత—రాగము-వరాళి-రూపకతాళము.

చింతింపఁగా నీ తేలతల్లులారా
వంతలన్నియుమాని-సంతోషమునఁబొరె ||ప||
ఏలచెమోచనచేము-సీలాగు కడచను
నీలోనసీపదు నాలుగువత్సరములు ౧
భరత నాసోదరా పరితాపమేటికి
ద్వారలోనె మేమూరి కరుదెంచువారము ౨

—()మంగళము()—

